సరస్వతీ గ్రంథమాల. 42 వ పుష్పము.

# సంయుక్త.

(చరిత్రాత్మక నాటకము.)

గ్రంథకర్తలు :

భాగవతుల వెంకటశాస్త్రి, బి. ఎ., ఎల్. టి.

విద్వాన్ తంగిరాల రామమూర్తి, బి. ఎ., బి. ఇడి.

# శాశ్వత మహారాజ పోషకులు.

1 మహారాజశ్రీ శ్రీరాజా విజయ అప్పారావు సవాయి అశ్వారావు జమీందారు, వ. బాదుషాహి మన్ సబుదారుసర్కారు, ముస్తుఫాన్నగరు. సంస్థాన్ పాలపంచ, శ్రీభద్రాచలం ఆండ్ నిడదవ్రోలు దొరవారు, శనివారప్పేట.

2 ,, చుండూరి నారాయణరావుగారు బ్యాంకర్సు.

---

# మహారాజపోషకులు.

3 శ్రీశ్రీశ్రీ సురభి వెంకటరత్నమాంబ నిజాం నవాబ్ వంతు బహద్దరు మాహారాణీవారు జటప్రోలు సంస్థానం, కొల్లాపురం.

4 ,, రాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారువారు వుయ్యూరు యెస్టేటు, నూజివీడు.

5 ,, సత్తి వెంకయ్యగారి కుమాళ్ళు కామరెడ్డిగారు, మార్టేరు.

6 ,, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రపత్రికా సంపాదకులు, మద్రాసు.

7 ,, జయంతి రామయ్య పంతులుగారు బి. ఎ., బి. ఎల్.
రిజిస్ట్రరు డిప్యూటి కలెక్టరు, ముక్త్యేశ్వరము.

8 ,, జవ్వాది లక్ష్మయ్యగారు ప్రెసిడెంటు యూనియన్
బోర్డు- డిస్ట్రిక్టుబోర్డు మెంబరు, పెనుగొండ.

# రాజపోషకులు.

1 శ్రీ శ్రీ శ్రీ వీర వెంకట సత్యనారాయణస్వామివారు, ధర్మకర్త,
శ్రీరాజా యి. వి ఆర్. యస్. ప్రకాశరాయ బహద్దూర్,
జమీందారువారు, ఉండూరు, అన్నవరం.

2 ,, జంపన సుబ్బరాజుగారు, ఖండవల్లి.

3 , శ్రీరాజా చింతలపాటి సూర్యనారాయణరాజుగారు,
ఏటికొప్పాక

4 ,, పెనుమత్స శీతారామరాజుగారు, ల్యాండులార్డు, అజ్జరం.

5 ,, ముత్తా సర్వారాయుడుగారు, బ్యాంకరు. కాకినాడ.

6 ,, భారతం సూర్యనారాయణగారు, ఎల్.ఎమ్.పి. ఖండవల్లి.

7 ,, అక్కివిళ్ళ చినవెంకటశాస్త్రిగారు, కాకరపర్రు.

8 ,, ద్వారంపూడి బసివిరెడ్డిగారు, మార్టేరు.

8 ,, మొసలికంటి రామారావుగారు, ల్యాండులార్డు, కాకినాడ.

10 ,, తణుకు భాస్కరరావుగారు, యల్. యమ్. యస్.
నేత్రశస్త్రవైద్యులు, ఐ స్పెషలిష్టు, తణుకు.

11 శ్రీ శ్రీ శ్రీ అణివిళ్ళ వెంకటశాస్త్రిగారు కాకరపఱ్ఱు.
12 ,, ఆకుండి రాజారావుగారు, ల్యాండులార్డు, పిఠాపురం.
13 ,, శ్రీరాజా వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దుర్ వారు,
జమీందారువారు, దొడ్డంపేట.

# పోషకులు.

1 శ్రీ శ్రీ శ్రీ రావుసాహేబు గుత్తా వెంకయ్య చౌదరిగారు, ఏలూరు.
2 ,, సి. సన్యాసిరాజుగారు, డాక్టరు, సామర్లకోట.
3 ,, లంక రామారావుగారు,యం.బి (హోమియో) కాకినాడ.
4 ,, కళా వెంకట్రావుగారు, అమలాపురం.
5 ,, నడింపల్లి సుబ్బరాజుగారు, కోడూరుపాడు.
6 ,, వైద్యరాజ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారు, ప్రొప్రయిటర్
వెంకటేశ్వర ఆయుర్వేదనిలయం, చింతలూరు.
7 ,, మొల్లేపెద్ది వెంకటకృష్ణారావుగారు, ఎం. ఏ.
గొంటువారిపాలెం.
8 ,, వక్కలంక నరసింహంపంతులుగారు కొప్పర్రు.
9 ,, రావుసాహేబు కలిచిట్టి అబ్బాయినాయుడుగారు, పూళ్ల.
10 ,, తల్లాప్రగడ భాస్కరరావుగారు, ల్యాండులార్డు, కోనాల.
11 ,, తణుకు రామారావుగారు, తణుకు.

# సహాయులు.

1 శ్రీ శ్రీ శ్రీ మోతే కృష్ణారావుగారు, జమీందారు, ఏలూరు.
2 ,, కొండూరి నారాయణరావుగారు, మర్చెంటు, ఏలూరు.
3 ,, పైడా శ్రీరామకృష్ణయ్యగారు, జమీందారు, కాకినాడ.
4 ,, పోలవరపు రామచంద్రరావుగారు, ఏలూరు.
5 ,, బసవ సూరన్నగారు, అత్తిలి.
6 ,, కాసాని అప్పారావుగారు, నిడదవోలు.
7 ,, తాడంకి సంజీవరావుగారు, జనరల్ మర్చంటు, బెజవాడ.
8 ,, కొల్లూరు మహాదేముడుగారు, కరణం, కొక్కిరపల్లి.
9 ,, గొంది కేశవులుగారు, ల్యాండులార్డు, కొవ్వలి.
10 ,, శిష్టా వెంకటసుబ్బయ్యగారు, నర్సాపురం.
11 ,, అప్పన లక్ష్మీపతిగారు, ముంజివరపుకొట్టు.
12 ,, వాజపేయాజుల రామసుబ్బారాయుడుగారు, కొల్లాపురం
13 ,, సూరిసెట్టి స్వామినాయుడుగారు, డిస్ట్రిక్టుబోర్డు మెంబరు, మగటపల్లి.
14 ,, సత్తి రామన్నగారు, సవరప్పాలెం.
15 ,, తణుకు వెంకటార్యుడుగారు, ప్రొప్రైటరు, S. S. S. Textile Colour Works, గొల్లపాలెం.
16 ,, భూపతిరాజు సూర్యనారాయణరాజుగారు, ఖండవిల్లి.
17 ,, నిమిషకవి భవానీశంకరరావు, యక్సైజు సబ్ ఇనస్పెక్టర్.

18 శ్రీ శ్రీ శ్రీ మామిడి సూరన్నగారు, ఇనుపపెట్టెలవర్తకులు, ధవళేశ్వరం.

19 ,, యం. రామకృష్ణయ్యగారు, డాక్టర్, నిడదవ్రోలు.

20 ,, జుట్టా శ్రీరంగనాయకులుగారు, పోలీసు సబ్ ఇనస్పెక్టరు, ఏలూరు.

21 ,, దమ్మలపాటి వెంకట్రావుగారు, ల్యాండులార్డు, బాదంపూడి.

22 ,, టి జీ బంగారుస్వామిసెట్టిగారు, రాజమండ్రి.

23 ,, పోడూరి కనకరాజుగారు, ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీసు, ట్రావెలరు, నిడదవ్రోలు.

24 ,, పరిమి సుబ్బారావుగారు, ల్యాండులార్డు, తణుకు.

25 ,, మెండు వీరన్నగారు, ల్యాండులార్డు, పినపళ్ళ.

26 ,, కాకరాల వెంకటరమణయ్యగారు, ప్రొప్రైటరు, శ్రీవెంకటరమణ ఆయుర్వేదనిలయము, సామర్లకోట.

27 ,, దుర్వాసుల సూర్యనారాయణగారు, ఇన్‌స్పెక్టర్, స్టార్ ఆఫ్ ఇండియా, రాజమండ్రి.

28 ,, యం. దశరధరామరెడ్డిగారు బుచ్చిరెడ్డిపాలెం.

29 ,, శ్రీపెండ్యాల శ్రీరామచంద్రవెంకటకృష్ణరంగారావు జమీందారువారు, కొండగూడెం ఎస్టేటు, దొమ్మేరు.

30 ,, మల్లంపల్లి వీరయ్యగారి కుమాళ్ళు సుబ్బారావుగారు, ల్యాండులార్డు, కొత్తపల్లి, అగ్రహారం.

31 సామంతుల వెంకన్ననాయుడుగారు, పోలీసు ఇన్‌స్పెక్టరు, ఏలూరు.

32 శ్రీ శ్రీ శ్రీ రంకిరెడ్డి సత్యనారాయణమూర్తిగారు, ల్యాండులార్డు, వేమగిరి.

33 ,, కామవరపు వెంకట్రావుగారు, రాజమండ్రి.

34 ,, కే. బాబూరావుగారు, Excise Sub Inspector, తెక్కలికోట.

35 ,, ద్వారంపూడి వెంకటరెడ్డిగారు, అనపర్తి.

36 ,, తోలేటి రామారావుగారు, మార్టేరు.

37 ,, ఉడత్తు వెంకటరమణగారు, రాజమండ్రి.

38 ,, మాజేటి హనుమంతరావుగారు, గుంటూరు.

39 ,, తుమ్మలపల్లి వీరభద్రరావుగారు, పిప్పర.

40 ,, మియ్యాపుర నాగేశ్వరరావుగారి కుమాళ్ళు రామకృష్ణారావుగారు ప్రయివేటు శెక్రటరీ, జటప్రోలః సంస్థానము, కొల్లాపురం.

41 ,, కొప్పల్లి శ్రీనివాసరావు పంతులుగారు, యెస్టేటు మేనేజరు, గద్వాల.

42 ,, కోట్ల వెంకటసుబ్బయ్యగారు దివాన్ జటప్రోలు సంస్థానం, కొల్లాపురం.

43 ,, నరసింహదేవర సూర్యనారాయణ సోదరులు కంట్రాక్టర్సు, వేమగిరి.

44 ,, నిమ్మగడ్డ వెంకటరమణయ్యగారు, I. C. I. Sub Distributor, భీమవరం.

45 ,, శ్రీజనార్థన గురుకులాశ్రమం, మత్స్యపురి.

46 శ్రీ శ్రీ శ్రీ కలిమిరెడ్డి పాపారావుగారు, ఆనరరీ మేజస్ట్రేటు,
రాజమండ్రి.

47 ,, పసుపులేటి బలరామమూర్తిగారు కోనాల.

48 ,, కటుకూరి సుందరరావుగారు, కోనాల.

49 ,, ఎ. నంజుండయ్యగారు, సెక్రెటరీ డిస్ట్రిక్టుబోర్డు, బళ్ళారి.

50 ,, కే. హనుమాన్‌సింగుహజారుగారు ఆదోని.

51 ,, కే. శివారెడ్డిగారు, విలేజిమునసబు, కలుదేవకుంట

52 ,, కే. గోవిందరెడ్డిగారు ఇంగదహాళ్ళు.

53 ,, కే. సి. తిమ్మారెడ్డిగారు, ఇంగదహాళ్ళు.

54 ,, చిక్కా కామేశ్వరరావుగారు, Sub Asst-Surgeon,
యమ్మిగనూరు.

55 ,, గుమ్మా సత్యనారాయణమూర్తి పంతులుగారు, వకీలు,
విశాఖపట్నం.

56 ,, తంగిరాల రామమూర్తిగారు } టీచర్సు, ఆదోని.
57 ,: భాగవతుల వెంకటశాస్త్రిగారు }

# త్రిలిఙ్గ.

వారపత్రిక. ఇందు ఆర్థిక, రాజకీయ, మత, నైతిక, సాంఘిక, పారిశ్రామికాది విషయములే కాక విమర్శనములు వ్యాఖ్యలు గూడ ప్రకటింపఁబడుచున్నవి.

తిరువత్తూరు, మద్రాసు. సం॥ రం॥ చందా రు 2-8-0

---

# జమీన్ రైతు.

నెల్లూరుజిల్లా జమీన్ రైతు సంఘయాజమాన్యమున ప్రతి శుక్రవారము ప్రకటింపబడును. జమీందారులన్న జడుపు ప్రభుత్వమువారన్న భయము నిజంచెప్పుటలో నీ పత్రిక నిర్మోమాటపు నిప్పు. కార్మికులకిది పట్టుకొమ్మ. ఆంధ్రరాష్ట్రమునందలి రైతులందరి అభివృద్ధికొరకు కృషి చేయుటకు కంకణము కట్టుకొన్నది.

సంవత్సరము చందా రు 4—0—0. నెల్లూరు.

---

# లోకల్ బోర్డ్సు మాసపత్రిక.

ఇది ప్రతిమాసము వెలువడు పత్రిక. ఇందు లోకల్ బోర్డ్సు సంబంధమగు పెక్కువిషయములు చర్చింపబడును. ఇది తూర్పుగోదావరిజిల్లాకపిలేశ్వరపురమునుండి వెలువడును.

సంవత్సరము చందా రు 3—0—0.

ఇదివరలో గ్రంథమాలలో బ్రచురింపబడి అమ్మకమునకు సిద్ధముగనున్న గ్రంథములు

| | |
|---|---|
| 1 కనకాంగి Approved | 0—8—0 |
| 2 ఆనందమయి 2 భాగములు Approved | 1—8—0 |
| 3 విజయశ్యామ్ Approved | 0—12—0 |
| 4 ప్రేమమహిమ Approved | 1—0—0 |
| 5 బిలమందిరము Approved | 0—12—0 |
| 6 మహారాష్ట్ర జీవనప్రభాతము Approved 2భా. | 1—8—0 |
| 7 దుర్గావతి | 0—12—0 |
| 8 హత్యానిరూపణము | 0—12—0 |
| 9 కష్టసుఖములు 2 భా॥ Approved | 1—8—0 |
| 10 నీలిపూలు | 0—12—0 |
| 11 పతితనళిని 2 భా॥ Approved | 1—8—0 |
| 12 అకాలీలసత్యాగ్రహము | 0—12—0 |
| 13 ప్రేమచందుకథలు Approved | 0—12—0 |
| 14 పిచ్చిపిల్ల | 0—12—0 |
| 15 నీతిముక్తావళి Approved | 0—2—0 |
| 16 జీవనసంధ్య | 0—12—0 |
| 17 కలము | 0—2—0 |
| 18 నా ఎలెక్షను అనుభవము | 0—12—0 |
| 19 రాజ్యపాలనాశాస్త్రము | 0—12—0 |
| 20 మరణభ్రమ | 0—12—0 |
| 21 చిత్తోడుపతనము | 0—12—0 |
| 22 కమలావిలాసము | 0—12—0 |
| 23 తమోభవనము 2 భాగములు | 1—8—0 |
| 24 సంయుక్త | 0—12—0 |

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

## పురుషులు.

పృథ్వీరాజు:—ఢిల్లీయజ్మీరుల ప్రభువు (కథానాయకుఁడు).

సమరసింహుఁడు:—చిత్తూరుప్రభువు (పృథ్వీకిఁ గూర్చువాఁడు).

కవిచంద్రుఁడు:—పృథ్వీయాస్థాన కవీశ్వరుఁడు (నాతని యాంతరంగిక మిత్రుఁడు).

జయచంద్రుఁడు:—కన్యాకుబ్జాధిపతి (కథానాయికతండ్రి.)

అసితసింహుఁడు:—ఘూర్జరాధిపతి( జయచంద్రుని మిత్రుఁడు).

జయంతుఁడు:—జయచంద్రుని మంత్రి

సుకలుఁడు:—ఆస్థానకవి రాజపురోహితుఁడు.

వికలుఁడు:—జయచంద్రుని ఆస్థానకవులలో నొకఁడు.

ఉదయార్కుఁడు:—ఉజ్జయినీపతి
రత్నసింగ్జు:—కోసలనేత
పాటలీపురాధిపతి
విదర్భాధీశుఁడు
} సంయుక్తా స్వయంవరమునకు వచ్చిన రాజులు.

అసఫ్ఖాన్:—మహమ్మద్ ఘోర్ సేనానాయకుఁడు.

కుతుబ్దీన్:—అసఫ్ఖానుసహ సేనానాయకుఁడు.

మఱియు కొందఱు సైనికులు సేవకులు వత్తురు.

స్త్రీలు.

సంయుక్త:—జయచంద్రుని కుమార్తె కథానాయిక.

మంజరి:—సంయుక్త అంతరంగిక సఖి.

జొహారున్నిసా:— అసఫ్‌ఖాన్ భార్య.

# నాంది.

శా. శ్రీరంజిల్ల హిమాచలంబునఁబవి ♦ త్రీభూతచేతస్కయై
ఘోరంబౌతపముం బొనర్చియలికా ♦ క్షుంబొందు టే
గాక పృ
థ్వీరాజుం బతిసేయుమమ్మ యనిత ♦ స్వేడంగసంయుక్తయా
నారిం బృథ్వికిఁగూర్చినట్టిగిరిక ♦ న్యాదేవిమమ్మోముతన్.

ఆ. వె. కోరుకొన్నమగనిఁ గూడుటయేగాక
తన్ను నమ్మినట్టి తరుణులకును
వారుగోరుకొన్న వరులను సమకూర్చు
నట్టిలోకమాత యరయుమమ్మ.

(నాద్యంతమునఁ బుష్పాంజలి విడిచి)

సూత్రధారుఁడు:—ఓహో! సభ్యులప్పుడే కరతాళ ధ్వనులచేత, నీలలచేతఁ దమ యుత్కంఠను సూచించుచున్నారు. (తెరవైపుచూచి) బావా! పాత్రలన్నియు సిద్ధమైనవా?

పారిపార్శ్వకుఁడు:— (ప్రవేశించి) అన్నియు సిద్ధమైనవి. నీవింక నిల్లేయున్న నీభూమిక నెప్పుడు ధరింతువు?

సూత్రి:—పృథ్వీరాజు మూడవరంగమునఁగదా ప్రవేశించుట! ఇంకను గావలసినంత వ్యవధి యున్నది.

పారి:—కావా! విద్వన్మణులగు కవిపుంగవులువ్రాసిన నాటకములు కుప్పలు కుప్పలుగా నుండ, నూరుఁ బేరులేని యీకవుల ప్రథమప్రయత్నమగు నీకొ్రొత్తనాటకము నీ వెత్తుకొనుటకుఁ గారణమిప్పుడైనఁ జెప్పెదవా?

సూత్రి:—నీకు దేశకాలపాత్రజ్ఞానములేదు. ఐనను నీ వసంతుష్టుఁడవగుట నాకిష్టములేదు. కావునఁ జెప్పెదను వినుము. కేవలపౌరాణికమునకును గేవల కల్పితేతివృత్తమగు సాంఘికమునకుఁ జరిత్రాత్మకము మధ్యస్థము. అందులో నీకవులరచనయుఁగేవల మధునాతమును గేవలసనాతమును గాక మధ్యస్థమై యొప్పుచున్నది. అందుచే నేనీనాటకమును బండితపామర రంజకమను నూహతోఁ బ్రారంభించితిని.

పారి:—చరిత్రాత్మకముల కేల యంత ప్రాశస్త్యము?

సూత్రి:—చరిత్రాత్మకముల వలన విలాసము విజ్ఞానమను రెండుప్రయోజనములను మనము సాధింపవచ్చును.

పారి:—అట్లయిన వీరు వ్రాసిన నాటకము తప్ప మరిమనమాడుటకు వేరు చరిత్రాత్మకనాటకములేవా?

సూత్రి:—(కోపముతో) ఈకవులు నాకు మిక్కిలి గూర్చువారు. తెలిసినదా ? ఇంక నీవిషయమున నెక్కువ చెప్పదంటు ప్రశ్నలువేసి కాలహరణమొనరింపక నీచెల్లెలి సంయుక్తపాత్రి సిద్ధముగానున్న మంజరితోఁ గూడఁ బ్రవేశ పెట్టుము. నే నిదేపోయి నాభూమిక ధరించెదను.

పారి:—మరి ఋతుగానము ?

సూత్రి:—అట్లయిన యిప్పుడు చరిత్రను దిరుఁగ వేయవలనసినదే ! ఘోరీ మొదటి దండయాత్ర యెప్పుడు చెపుమా ! (అలోచనమభినయించి) సంవత్సరము జ్ఞాపక మున్నది కాని, నెలకాని ఋతువుకాని జ్ఞాపకము లేదు. ఇంత కును ఋతు గానమొందులకు ? ప్రేక్షకులపై మచ్చుజల్లు టఁకుగదా! ఆపని నీచెల్లెలెట్లును జయప్రదముగా నిర్వహించఁ గలదు. నాటకమామె గానముతోనే ప్రారంభముకదా ! అదిగో ! ఆమె అప్పుడేవచ్చి, ప్రవేశమున కెదురుచూచుచు బాత్రిః కాలవర్ణనపద్యములఁ జదువుటకుఁ గావలయు గొంతు సవరించుకొనుచున్నది. మనమింక లోనికిఁ బోవుదము. రా !

(నిష్క్రమింతురు.)

ఇదిప్రసానన.

ఈ నాటకము గ్రంథకర్తల గాని
ప్రకాశకులగాని వ్రాతమూలమున
ననుమతి పొందనిదే
ప్రదర్శింప కూడదు.

ప్రకాశకులు.




## ప్రథమాంకము.



### ప్రథమ రంగము.



ప్రదేశము:—ఢిల్లీకిని గన్యాకుబ్జమునకు మధ్యనొక యరణ్యమున నొక గుడారపు లోపలిభాగము.

సంయుక్త యొకమంచముపైఁ గూర్చుండియుండును.

సం:—క॥ ప్రాతఃపతిదర్శనసం।
జాతస్వేదమునఁ గరఁగిజాఱినప్రాచీ
నాతీకుంకుమతిలకము
భాతిందోలిసంజకెంపు భాసురమయ్యెన్॥

ఉ॥ అల్లదె తెల్లవారె తగవాశయనింపఁగ నింకనంచును
త్పుల్లసుసౌరభాఢ్యమృదుపుష్పక శయ్యలనున్నవారిదా

మల్లన లేపుచుండెదుల యాచలకూటవినిర్గతంబుకిం
చల్లనిపిల్ల తెమ్మెరలు సారెకుసారెకు మేనుదట్టుచున్॥

ఉ॥ ఇమ్ముగఁగమ్మ తెమ్మెరలు హెచ్చెపులుంగు వెలుంగు లిచ్చెమో
దమ్ములు లేక నొచ్చెఁగుముదమ్ములు, రాజపరార్ధిఁజొచ్చె దీ
పమ్ముల, గాంతిచచ్చె, రవివచ్చెకరంబు వెలుంగు దెచ్చెఁజ
క్రిమ్ములచింతవుచ్చె, కౌతుకమునఁదమ్ములు విచ్చె మోములన్॥

మంజరీ ! నీవింకను సిద్ధముగ లేవా ?

మంజరి:—(ప్రవేశించి) ఏమమ్మా ! యుద్ధమున నీకెంత కౌతూహలము ! కావుననే మన మహారాజునకుఁ దెలియకుండ నతఁడు బయలుదేరిన పిమ్మట నన్నుఁ బ్రోత్సహించి భవదధీనముననున్న ఆరునూరులభటుల వెంటబెట్టుకొని ఇంత దూరమీయరణ్యమునకు వచ్చితివి. లేకున్న నిజముగ మనము మన మహారాజునకు సహాయము చేయఁగలమనియే వచ్చితిమా ?

సం:—మంజరీ !

మ. జననంబందితి రాజవంశమున శస్త్రంబెల్లరున్ మోదమున్
గనఁజేపట్టితి యుద్ధపుం గ్రియలవేర్కన్ శిక్షణంబందితిన్
జనముల్ మెచ్చఁగ నభ్యసించితి సమస్తంబైనసద్విద్యలన్
జను నేనీవిట్లుఁ బల్కఁజూచుటనునుం జంద్రాస్య హేలా
గతిన్.

చ. తులయిడరానియట్టి రహతూరుకులమ్మున నుద్భవించియు
జ్జ్వలఘన తేజుఁడైన జయచంద్రనృపేంద్రునిముద్దుబిడ్డనై
యలికచలేరు నేరని మహాయుధవిద్యల నభ్యసించినే
సలుపఁగ లేనెకయ్యమునుసాయముగాఁజని,నాదుతండ్రికిన్

మం:—అట్లేల యెంచెదను ? నిన్ను నే నెఱుఁగనా ? కాని దేశమును గొల్లగొట్టుటకు ఘోరీచేఁ బంపఁబడిన తురుష్క సేనలఁ దరుమఁగొట్టుటకుఁ బృథ్వీరాజాది శూరాగ్రేసరుల సహాయమొల్లని మీతండ్రి యాఁడువారలమగు మన సహాయ్యము నపేక్షించునా యని సందేహించితిని.

సం:—అన్నట్లు మరచితిని. ఢిల్లీశ్వరుఁడగు పృథ్వీరాజు బలవంతుఁడనియు శౌర్యవంతుఁడనియుఁ జెప్పుకొందురుకదా ! మాతండ్రి యాతనితోఁ గలసి యేల శత్రువులఁ దాఁకరాదు ?

మం:—దానికిఁ గారణము లేకపోలేదు. జయచంద్ర మహారాజునకుఁ బృథ్వీరాజనిన శత్రుభావమే కాని మిత్రభావము లేదు. అదిగాక మన మహారాజునకు ఘూర్జరదేశాధిపుఁడైన యసితసింహమహారాజు కడుఁగూర్చువాఁడు. అతనికిఁగూడఁ బృథ్వీరాజునం దసూయాభావమే. మన మహారాజతనితో నాలోచింపక యేపనియుఁ జేయఁడు. అందుచే

మనవారు పృథ్వీరాజుతోఁగాని ఆతని మిత్రుఁడును మఱి యుఁ జిత్తూరురాణాయ నగు నమరసింహ మహారాజుతోఁ గాని కలియరు.

సం:—ఇప్పు డుత్తర హిందూస్థానమున నీనాలుగురాజ్య ములేకద ముఖ్యమైనవి! అట్టియెడ వీరు నలుగురు నేకమై యెదిరించిన నొక్క ఘోరీకేకాదు మరియే యితరాన్య దేశీ యునకైనను మనపైఁ దేరిచూచుటకైన సాహసముండునా?

మం:—ఔనమ్మా! వీరందఱు నేకమగుట మంచి దని చెప్పవచ్చును గాని వారిచే నట్లు చేయించుట సులభ కార్యముగాదు.

గీ. తెగినహారములోని ముత్తెముల వ్రాలె
జెల్లచెదరుగనున్న దేశీయజనుల
నేకముఖముగఁ గూర్పంగ నింతిమిన్న
యవతరింపవలె నొకమహాత్ముఁడిలను.

అదిగాక మఱియొక కారణముకూడఁ గలదు. ఇప్పుడు కొల్లగొట్టబడిన దేవాలయము మనరాజ్యమునకును ఢిల్లీ రాజ్యమునకును సరిహద్దులలో నున్నది. అది మనరాజ్య ములోని దని మన వారనుచున్నారు, వారిరాజ్యములోని దని వారనుచున్నారు. మనహక్కు స్థిరపర్చుటకేగదా మన

మహారాజప్పుడా దేవాలయపు సొత్తు నపహర్తలనుండి పున రుద్ధరింపఁజూచుట !

సం:—ఆఁ! పృథ్వీరాజునకు మాత్ర మీ విషయ మునఁ బట్టుదల యుండదా యేమి? మన చారులు మనకుఁ జెప్పినట్లే యతని చారు లతనికిఁగూడ దేవాలయపు వృత్తాంత మెఱిఁగింపకుందురా! అతఁడుకూడ వచ్చిన మధ్య మనవారికిని వారికిని గయ్యా మగునేమో ?

మం:—పృథ్వీరాజు మనమున నెప్పుడును స్వార్థము కంటె దేశార్థ మున్నతపీఠ మధిష్ఠించి యుండును. కావున నతఁ డనవసరముగ మనవారితో మచ్చరింపఁడు. అతఁడు వచ్చిన దేశహితార్థమే వచ్చును. అతఁడే వచ్చిన శత్రు సేనలు పటాపంచలు గాకుండునా ?

శం:—అట్టి మహానీయునితో మాతండ్రికి విరోధ మెందులకే? వివాదముల కిదియా సమయము. దేశహితము కొఱకై పృథ్వీరాజుతో సఖ్యము చేయుట మంచిదికాని పగ మనమున నిడుకొనుట శ్రేయమా ? అతని కిట్టి బోధ చేయువా రెవ్వరును లేరా ?

మం:—లేకేమి? మన మహారాజు నెప్పుడును వెన్నంటియుండు అసితసింహ మహారాజున్నాఁడు కద అసూయ

మఱింత పెంపొందించుటకు! అతఁడతని రాజధానికంటె మన పట్టణముననే యెక్కువకాలముండి మన మహారాజునకు నీడవలె నుండును. ఇప్పుడిదియంతయు నతని ప్రోద్బలముచేతనే.

సం:—మంజరీ! పృథ్వీమహారాజును నీ వెప్పుడైనను జూచితివేమే?

మం:— లేదమ్మా! వినుటయే కాని చూచుటలేదు. అతఁడు మిక్కిలి రూపవంతుఁడును విద్యావంతుఁడును శౌర్యవంతుడనియుఁ జెప్పుదురు.

సం:—ఎట్టివానితో మా తండ్రి విగ్రహించినాడే?

మం:—(స్వ) ఈమెకుఁ బృథ్వీరాజు పేరు వినినమతిపోవును. ఈమె నిప్పుడు కొంచె మాడించెదను. (ప్ర) అవునమ్మా! అట్టి బలవంతుఁ డల్లుఁడైన మన మహారాజునకెంత శ్రేయస్సు.

సం:—(తెచ్చుకోలు కోపముతో) నేను రాజకీయ విషయము మాట్లాడుచుండ నీ కీవిపరీత వ్యాఖ్యాన మొందులకే?

మం:—(చిఱునగవుతో) ఎందుకమ్మా నీ కింత కోపము? నేను చెప్పినది మాత్రము రాజకీయ విషయము

కాదా? నీవు చెప్పినది భౌతికరాజకీయ విషయము. నేను చెప్పినదిసంయుక్తాహృదయ సామ్రాజ్య రాజకీయవిషయము. ఇంతే భేదము.

సం:—(చిఱునగవు నడచుకొనుచు) చాలును లేవే నీ చమత్కారము. నీ చెప్పుడును విపరీతార్థములే తీయుచుందువు. (తెరలో భేరీరవము) అదిగో మన మహారాజు సేనలు బందిపోటుల నన్వేషించుటకు బయలుదేరుచున్నవి. మంజరీ, మన దళముకూడ సిద్ధముగ నున్నదా? మన రాక రహస్యముగా నుంచుమని మన సైనికులకు హెచ్చరించితివా? మార్తండికి మన రాక తెలిసిన మనల నింటికిఁ బంపివేయునుసుమా!

మం:—అంతయు సిద్ధముచేసితిని. మంజరి సామర్థ్యమింకను నీకుఁ దెలియదు

సం:— తెలియకేమి? అన్నివిధముల మంజరియే కదా నాకుఁ దోడును నీడయు. మన మింకఁ బురుషవేషముల ధరించి బయలుదేరవలయు. త్వరపడుము.

(వా రిరువురును బురుషవేషముల ధరించుచుండఁగాఁ దెర పడును.)

## ద్వితీయ రంగము.

స్థలము:--ప్రథమరంగములోని యరణ్యమున మరి యొకస్థలమున నొకగుడారము.
(అసఫ్‌ఖాన్, జోహారున్నిసాయు నాసనములపై గూర్చుండి యుందురు.)

అసఫ్:—ప్రేయసీ! చూచితివా? హిందూదేశ మెంతభాగ్యవంతమైనదో! మొన్నరాత్రి కొల్లగొట్టినగడియ క్రింద నిచ్చుటకుఁ గుతుబ్‌దీన్ దెచ్చిన దేవాలయవస్తునిచ యమెంత విలువగలదో నిర్ధరింపఁగలమా? మనలను మన యేలిక శహాబుద్దీన్ ఘోరీయిక్కడకుఁ బంపిన పని వృథ కాలేదుసుమా!

జో:—నాథా, మీరెన్ని చెప్పినను నాకీపని సమాజ సముగఁ గన్పట్టలేదు. స్వార్థముకొఱకు కన్యదేశీయుల స్వేచ్ఛ నుధ్వంసము చేసి వారి మతమున కంతరాయము కల్గించుట యెంతమాత్రమును బాగులేదు. మనమసీదులు మనకెంత పూజ్యములో వారిదేవాలయములు వారికంత పూజ్యములు కావా? మిమ్ముల వీడలేకను హిందూదేశమునఁగల వింతలఁ జూచుటకును మీతో నీదేశమునకు వచ్చితినేకాని యీపని నాకెంతమాత్ర మిష్టము లేదు.

అసఫ్:—అవును జొహార్! మనమేమి చేయఁ గలము. ఉద్యోగధర్మమట్టిది. గజ్నీమహమ్మదుకూడ నీదేశముపై నెన్నియోమారులు దండెత్తి ధనమును గొల్లగొట్టెను గాని యతఁడా ధనమునంతయుఁ గళాపోషణమునకే వినియోగించెనఁట. అతనికిఁ గళలన్న నెంత యభిరుచియోగాని ప్రపంచమునఁ గల గొప్పగొప్ప కవులను, గాయకులను, శిల్పులను నిర్బంధముచేసియో ధనమిచ్చియో తీసికొనిపోయి తన యాస్థానమున నుంచుకొనెడి వాడట; కనుకనే ఫిర్దౌషీ వంటి మహాకవిని దన యాస్థానమున నుంచుకొని షానామా వంటి యుత్తమపద్యకావ్యమును వ్రాయించి పారసీకమున కుత్కృష్టసేవచేయఁ గల్గెను. మన శహాబుద్దీన్ గోరీ నవాబున కట్లుగాక ధనాశయు రాజ్యతృష్ణయు మిక్కుటముగనున్నవి. అయినను రాజులకు ధనాశగుణమేకదా?

జొ:—ధనాశయుండ వచ్చును. గాని ధనార్జనమున కిదియామార్గము? ఇది దౌర్జన్యసహితము కూడ నగుటచే నాకు మరింత రుచింపకున్నది. హింసలేకుండ కార్యము సానుకూలమగునట్లు—

అసఫ్:—జొహార్! నీ వెంత వెఱ్ఱిదానవు. ఆడుదాన వగుటచే నట్లనుచుంటివి. గాని హింస లేకుండ ధనార్జన మెట్లగును?

జో:—అది సరియేకాని ఇప్పుడు సైన్యసహాయముతో మనము మన దేశమునకుఁ బంపిన దేవాలయధనము హిందూరాజు లెవరైన నాటంక పరతురేమో యని భయము కల్గుచున్నది.

అసఫ్:—ఆఁ! ఎవరాటంక పరతురు? ఆదేవాలయపు హక్కు పృథ్వీరాజునకును జయచంద్రునకును వివాదలలో నున్నదట. వా రిరువురును వచ్చిన, వారితో వారికే యుద్ధమగును. ఒకరే వచ్చిన మన సేనలు త్రుటిలోఁ గెలువగలవు.

జో:—హిందూరాజులన్న మీకంత చులుకనగఁ గనిపించుచున్నారా? ఒకరేవచ్చిన మనసేనలు గెలువఁగలవని మీరెంత ధైర్యముగఁ జెప్పుచున్నారు? పృథ్వీరాజు శౌర్యమసమానమని మీరు వినియుండలేదా?

అసఫ్:—వింటిని కాని మనసేన లపారముగదా, భయమేమి? (అప్పుడొక మహమ్మదీయ చారుడు రోజుకొనుచు పరువెత్తికొని వచ్చును.)

చారుఁడు:— (సలాంచేసి) అసఫ్ఖాఁ సర్కార్! ఇక్కడ కొంచెందూరంలోకి హిందూకాఫర్లకీ గుడార్లాల్కసూఁకాం! హిందూ సిపాయిల్ కి బీపక్ దో కనిపించింది సర్కార్.

అస:—అయిన మధురానగర దేవాలయపు దోపిడి విని జయచంద్రుఁడో పృథ్వీరాజో సేనతో వచ్చియుండ వచ్చును. కుతుబ్ దీనాకు సహాయముగ నేను వచ్చుచున్నాను. మన వారిని ధైర్యముగఁ బోరుడని చెప్పుము. నీవుపొమ్ము. నేనిప్పుడే సన్నద్ధుఁడనై వచ్చెదను.

చారుఁడు:—చిత్తం (సలాంచేసి నిష్క్రమించును.)

అసఫ్:—మనమను కొన్నట్లేయయినది. నేనిఁకఁ బోవలయును. నీవిచ్చటనే యుండుము.

జో:—నేనుకూడ మీతో వచ్చెదను. నాకుఁగూడ యుద్ధము చూడవలెనని యున్నది.

అస:—యుద్ధము ప్రమాదకరము. ఒకప్పుడు మన కపజయముకలిగినచో నిన్ను శత్రువులు పట్టుకొన్న నపాయము. నీవేలవచ్చెదవు ?

జో:—మీరుండ నాకేమిభయము? యుద్ధము చూడనాకుఁ జాలకౌతూహలముగనున్నది.

అస:—అట్లయిన రమ్ము. కాని మిక్కిలి జాగ్రత్తగ నుండవలెసుమీ.

జో:—మరేమియు భయములేదు.

(ఇరువురు నిష్క్రమింతురు. తెర.)

## తృతీయరంగము.

ప్రదేశము:—ప్రథమరంగములోని యడవిలో మఱియొక భాగము.

ప్రవేశము:—జయచంద్రుఁడు, నసితసింహుఁడు.

జయ:—అసితసింహా! ఎంత వెదకిన బందిపోటుల జాడలు కానరాకున్నవే. పృథ్వీరాజుకూడ మనవలె నిచ్చటకు వచ్చి మనకంటె ముందు బందిపోటులనుండి దేవాలయ ధనమును బునరుద్ధరించినచో మనము వచ్చినపని వృథాయగును.

అసి:— అతఁ డెందులకు వచ్చును లెండు. ఇక్కడకు ఢిల్లీ చాలదూరమున నున్నది. అతనికి దేవాలయ వృత్తాంతము తెలియుటయే కష్టము. ఒకవేళ తెలిసిన నింత త్వరలో సైన్యమును గూర్చుకొని రాగలఁడా?

జయ:—అట్లనకుము. పృథ్వీరాజును మన మెంత యసహ్యించుకొనినను వాని శక్తినిమాత్రము చులకన చేయఁజాలము సుమా!

అసి:—ఆఁ! చాలునులెండు, లోకము గుడ్డిది. ఎవఁడో యొక డొక పురుషుని స్వార్థముకొఱకుఁ బొగడి లేని

ప్రతిభ నాతని కారోపింపఁ బ్రజలందఱు దానిని విమర్శ నముగా నమ్ముదురు; పృథ్వీరాజు కీర్తి యిట్టిదే. కాని నిజ ముగ నతఁడు ప్రజ్ఞావంతుఁడుకాఁడు. పరమేశ్వరుని దయ వలన నాకు నతనికి నెప్పుడైన ద్వంద్వయుద్ధము తటస్థించిన మా యిరువుర తారతమ్యములు బోధపడఁగలవు.

జయ:—(కొంచెము దూరముగఁ జూచుట నభిన యించి) అసితా! అటు చూడుము. ఏదో తురుష్క సైన్యము వచ్చుచున్నట్లున్నది. మన సైన్య మప్పుడే దానిని సమీపించినది.

అసి:—(చూచి) ఔను. చాల దగ్గఱకే వచ్చినది. ఆ తురుష్క సైన్యమును బహుశః దేవాలయ ధనము మన చేతికిఁ జిక్కకుండ కాపాడుటకుఁ దురుష్క సేనాధిపతి ధనము వెనుకఁ బంపియుండును.

జయ:—అదిగో చూడుము. ధనమును మోసికొని పోవుచున్న సేవకు లీవైపునకే వచ్చుచున్నారు. మనము వీరల నడ్డగించి ధనపేటికలఁ దీసికొని దేవాలయమునకుఁ బంపివేయుదము. (అంతఁ గొందఱు మహమ్మదీయ సేవకులు తలలపైఁ బెట్టెలఁ బెట్టుకొని ప్రవేశింతురు.)

జయ:—(అసితునితో) నీవు వీరల వెంబడించుము. నే నీప్రక్కనే కొంతదూరము పోయి వీరల కెదురుగ వచ్చి యాటంక పరచెదను.

అసి:—అట్లే కానిండు. ఇంక వీరల నెంతమాత్రము సాగనీయకూడదు. (జయచంద్రుఁడు నిష్క్రమించి రెండవ వైపునుండి ప్రవేశించును.)

జయ:—దుష్టులారా! ఆగుడు

అసి:—ఇఁక మీరు చచ్చితిరి? ఎందుఁబోఁగలరు? పరమేశ్వరద్రవ్యము నపహరించిన మిమ్ముఁ బరమేశ్వరుఁ డూరక విడుచునా?

జయ:—ఆపెట్టెల నచటనుంచి మీరు చేతులు జోడించుకొని నిలువఁబడియుండుఁడు. అసితా! వీరల ఖైదీలగాఁ గొనుము. (మహమ్మదీయ సేవకులు క్రిందపెట్టి, ఎలుఁగెత్తి)

మహ॥ సేవ:—కుతుబ్ దీన్ సర్కార్! దుష్మన్ ఆయా!

కుతుబ్:—(ప్రవేశించి) సేవకులారా! భయపడకుఁడు. అల్లాకుఁ బ్రీతికరమగు నట్లీ కాఫరులనుసఫా చేసెదను.

(తెరలో యుద్ధపు కలకలము.)

అసి:—మనయత్నము సాగకుండ వీడడ్డమువచ్చి నాఁడు. (కుతుబ్ దీన్ అసితునిఁ గొట్ట నాతఁడు పారిపోవును.)

(జయచంద్రుఁడు కుతుబ్ దీన్ యుద్ధము చేయుదురు. జయచంద్రుఁడు బంధింపఁబడును.)

కుతుబ్:—స్వదేశము కొఱకుఁ బ్రాణత్యాగము నకు సిద్ధపడిన నీ ధైర్యము మెచ్చఁదగినది.

పఠాను సేవకులు:—పాపమీ రాజపుత్రుఁడు మొగ మింత చేసికొనినాఁడు.

కుతుబ్:—బలవంతుఁడనని విఱ్ఱవీగు పృథ్వీరాజవు నీవేనా ?

జయ:—నే నెవ్వఁడనైన నీకేల ? (కుతుబ్ దీన్ జయచంద్రుని కాలు సేతులు బంధించుచుండును. అనతిదూర ముననఁ బురుష వేషమున సంయుక్తామంజరుల ప్రవేశము.)

సం:—మంజరీ ! మన వేషములు బాగుగఁ గుదిరి నవా ? ఇప్పుడు మనల నెవరును బోల్చుకొన లేరుకద ! మా తండ్రి నన్ను గుర్తించినచో నన్నింటికిఁ బంపివేయును.

మం:—నీకట్టి భయ మక్కఱ లేదు. మనలను సృష్టిం చిన స్రష్టకూడ మనలను బోల్చుకొనఁ జాలఁడు.

3

కుతుబ్ :—సేవకులారా ! వీనినిఁ దీసికొనిపోయి అసఫ్‌ఖాన్ సాహెబు కాళ్ళపైఁ పడవేయుఁడు.

జయ:—సాహేబు కాళ్ళపై మాత్రముపడను.

కుతుబ్ :—సమయము తప్పివచ్చినప్పుడు పడకేమి చేసెదవులే.

సం:—(ఆవంకఁజూచి) మంజరీ ! ఇదియేన్యాయమే కన్యాకుబ్జాధిపతి ఖైదీగాఁ బట్టుకొనఁబడెను. మనమిప్పుడేమి చేయుదము.

మం:—అనంతసైన్యములతో నధిపతి చేయలేనిపని ఆరునూరుభటులతో నాడువారమగు మనము చేయఁగలమా?

సం:—కాని పితృస్నేహము నన్ను వెనుకంజవేయ నీయుటలేదు.

మం:—అట్లైన మంజరి నీడవలె నిన్ను వెన్నంటి యుండును. తడయవలదు.

సం:—(తెరవైపు జూచి) సైనికులారా ? ఈమహా మ్మదీయ హంతకులఁ బరిమార్పుఁడు. నేను సార్వభౌముని విడి పింతును.

కుతు:—నూతన శత్రువులు వచ్చినట్లున్నదే.

(సంయుక్తా మంజరులు కుతుబ్ దీనుని సమీపింతురు)

కుతు:—సౌందర్యము రాజపుత్రుల సొమ్ము. ఏమి యీ యువకుల సోయగము? యుద్ధము, వేట, మున్నగు కఠినకర్మలకలవడిన పురుషులే ఇంత సుందరముగనుండ, నిరంతర మంతఃపురముననే యుండి యెండకన్నెరుంగని వీరి సుందరాంగు లెంత మనోహరముగా నుండునో ?

సం:—సాహేబువర్యా ! యీ మహారాజును విడిచి పుచ్చుము.

కు:—అది నాచేతఁగాదు.

సం:—అట్లైన నీవీతని విడుచునట్లు చేసెదను.

కు:—నీకు మగతనమున్నచో.

మం:—(తనలో) వీడు మమ్ముల ననుమానించి యుండలేదు కదా! సార్వభౌముఁడు కూడ నిచ్చటనే యున్నాఁడు.

సం:—అట్లయిన యుద్ధమునకు సిద్ధముకమ్ము.

కు:—మీ వయసును, జక్కఁదనమును జూచి మిమ్ములఁ గొట్టుటకునాకుఁ జేతులాడకున్నవి.

మం:—మేమేమి యాడువారల మనుకొంటివా ?

కు:—భగవంతుఁడు మిమ్ముల నట్లుచేయ నుద్దేశించి యుండవచ్చును.

సం:—మేము మీతో వాగ్వాద మొనరించుటకు రాలేదు. ఈ శస్త్రఘాతమును గాచుకొమ్ము. (సాము చేయును.) ఇంక మీ ప్రాణములు మీకుఁ దక్కవు. సఖా! ఆ మహారాజును బంధవిముక్తుని గావించి యాతనికొక శస్త్రమిమ్ము. వీరల నేను తుదముట్టించెదను. (తెరలోఁ గలకలము). ఎవరో వచ్చుచున్న ట్లున్నది. శత్రువు లేమైనఁ జాల ప్రమాదము. త్వరపడుము. (సాముచేయుచు శత్రువులతోఁ బోరుచుండును.)

(ప్రవేశము: అసఫ్‌ఖాన్, జోహారుసేనా)

అసఫ్:—జోహార్! చూచితివా! మనవారు కాఫరులచే నెట్లు నిరోధింపఁబడిరో?

జోహార్:—(దూరముగాఁ జూచి) ఏమియాహిందూ వీరుల పౌరుషము? ఒక్కొక్కఁడు నూరుమంది మహమ్మదీయుల డీకొనుచున్నాఁడే! (ముందునకుఁ జూచి) అందఱకన్న సుకుమారుఁడా రాకుమారుఁ డెవ్వఁడో కాని రుస్తుం వలెఁబోరుచున్నాఁడు. అతఁడు స్త్రీయైపుట్టియుండిన నిజ

ముగా భువనైక సుందరియని చెప్పవచ్చును. (అసఫ్‌ఖాను శతృవుల సమీపించును.)

అసఫ్:—ఈగడబిడయేమి ?

కుతుబ్:—జనాబ్ ! మేము మధురానగర దేవాలయమునుండి తీసికొని వచ్చిన ధనము మనరాజ్యమునకుఁ దీసికొని పోకుండ నీదుర్మార్గులడ్డగించుచున్నారు.

అస:—(తెరవైపు చూచి) మార్.

(తెరలో) అల్లాహో అక్బర్. మార్ కాఫర్‌కీ మార్.

సంయు:—కార్యము చెడివచ్చినది. అయినను భయము లేదు. కరాలంకారముఁ గులాలంకారమునగు స్వరవాలరాజము కరమునందు కలయంతవరకు.

అస:—యువకురాలా ! ఖడ్గములను క్రిందఁ బెట్టి కరములను జోడింపుము.

సం:—అది మా కులమునకపరిచితమగు విషయము.

(సంయుక్తా మంజరులు ఖాన్‌దీన్లతోఁ బోరుచుందురు. మంజరి మూర్ఛపోవును.)

సం:—నా దక్షిణ భుజము నేలఁ గూలినది. సరే యిపుడు విచారించుటకవకాశము లేదు. మీ యిద్దఱతోఁడ

నేనే పోరెదను. (సంయుక్త ఒక్కతెయే ఖాన్‌దీన్‌లతోఁ బోరుచుండును. సంయుక్త బలము క్రిమముగా క్షీణించు చుండును.)

జో:—పాప మీ బాలకుడలసిపోయినాడు. ఈ ముష్కరులకు ధర్మాధర్మవిచక్షత లేదు. ఒక బాలునితో నిరువురు పోరుటయా? ఇంకొక గడియలో నీతఁడు నేలఁ గూలఁగలఁడు. అయ్యో! ఎవరైన వచ్చి వీనికి సాయపడ రాదా? కాదు. నేనే పోయి వారి కడ్డముగా నిలచెదను. ఈ అధర్మయుద్ధమును సాగనీయను.

ప్రివేశము:—పృథ్వీరాజు, కవిచందు్రిఁడు (సమరసింహుఁడు.)

పృథ్వీరాజు:—ఓహో సైనికులారా!

ఉ. మ్లేచ్ఛులఁ జేరవచ్చితిమి మీజినశక్తి నరాతిగెల్చి మీ
స్వేచ్ఛను నిల్పుకొందురొ ప్రసిద్ధపరాక్రమ మేట
గల్పుచున్
దుచ్ఛశరీరమున్ దలఁచి తోరపులజ్జరణంబువీడి జీ
వచ్ఛవముల్ బరెన్ మనుచుఁ బ్రాణముతీపని యాత్మ
నెంతురో.

కవిచంద్రుఁడు:—యోధవరులారా! రణమును వీడి మాత్రముపోకుఁడు. ఏమందురా

మ. అరివీరావళిఁ దాఁకి తత్తనువులు గ్రాస్త్రాళిచేఁ గూల్చినన్
దరహాసాంచితకీర్తి మేచకక చోద్వాహైకభాగ్యంబు సం
గరమందున్ మద వైరివీరకరఖడ్గప్రోద్ధతిన్ గూలినన్
వరరంభాకుచకుంభగాఢపరిరంభప్రోద్యదైశ్వర్యముల్.

సమరసింహుఁడు:—

ఉ. గర్వితవైరి వీరవరకంఠవిలుంఠన పౌరుషక్రియా
నిర్వహణత్వదీయ రస నిస్రుతగాథల హైందవశ్రవః
పర్వము చేయకున్నఁ గరవాలము దాల్చి ఫలంబదేమి యీ
యుర్విని జన్మమందిన ప్రయోజనమే మవనీభరంబెయౌ.

పృథ్వి:—పాప మా బాలకుఁ డెవరో యిరువురతోఁ బోరుచున్నాఁడు. బాలభానుని మందేహు లాక్రమించినట్లు వీనిని మ్లేచ్ఛు లాక్రమించిరి. మీ రిరువురును ద్వరగఁబోయి ధనమును వశపరచుకొనుడు. నేను వీనిని సంరక్షించెదను.
(కవిచంద్రుఁడు సమరసింహుఁడు నిష్క్రమింతురు.)

పృథ్వి:—(సంయుక్తకును మ్లేచ్ఛులకునుమధ్యనిలచి) వీరవతంసమా! నీవింక సేదదీర్చికొనుము. నే నిదే వీరల మదము సదమదము గావించెద. (మ్లేచ్ఛులదిక్కు మొగమై)

ఉ॥ ఒక్కనితో ననేకులగు యోధులు యుద్ధము చేయ నెంచుటల్
మిక్కిలి నీతిబాహ్యమని లేశము నాత్మలయందు నెంచకే

యుక్కున దాఁకి యీ తరుణయోధునిఁ గూల్పఁగ
నెంచు మీతలల్
వ్రక్కలఁ జేసి యీధరణి రాలఁగఁ జేతుఁ దదీయ
ఖండముల్.

జో:— అమ్మయ్యా! నేను జోసక్కర లేకుండ ఎవఁడో యొక మహావీరుఁడు వచ్చినాడు. అబ్బా! యేమి యీతని తేజము! ఈతఁడిప్పుడు మధ్యందినమార్తాండుని వలె దుర్నిరీక్షణుఁడై, ముఖమండలము స్వేదబిందువులచేఁ దోఁగఁ, బొమలు ముడివడ, ఔడుగరచి, మూర్తిభవించిన వీరరసాధిదేవత వలె నున్నాఁడు.

(పృథ్వీ ఖడ్గచాలనమున మ్లేచ్ఛులు పరుగిడుదురు.)

జో:— ఈ వీరుని ఆగమనమాత్రముననే సూర్య దర్శనమున మంచు విడిపోయినట్లు మా సైనికులు పటాపం చలైరి. మావారు నన్నుఁగూడఁ గణింపక, స్వప్రాణ రక్షా దక్షులై పలాయనమంత్రమునుఁ బఠించిరి. ఆబాలకుఁడు ప్రాణాపాయదశయందుఁగూడఁ బరుగిడ లేదే: నే నావీరు నితో మాట్లాడెదను. (ముందునకు నడచును.)

పృథ్వి.— (సంయుక్త దిక్కు మొగంబై) వీరకులాలం కారమా!

గీ॥ కంటి కింపైన మేటి చక్కదనంబు
విస్మయంబును గలిగించు విక్రమంబు
నిండియుండెను నీయందు రెండు నహహ
వజ్రమందుఁ గాంతి కఠినత్వములు వోలె.

ఇట్టి నీ విట్లొంటరిగా వీరలకుఁ జిక్కుటఁ గారణమరయ వచ్చునా ?

సం:—మేము కన్యాకుబ్జమునకుఁ జెందిన దళాధిపతులము. అధిపతిని విడిపింపఁబోయి శత్రువులమధ్యఁ జిక్కితిమి. నాసఖుడిదే నేలవ్రాలియున్నాడు.

పృథ్వీ:—కన్యాకుబ్జాధిపతియేడీ ?

సం:—మహమ్మదీయ సైనికులాయనతోడనే పలాయనము గావించిరి.

పృథ్వీ:—నీసఖునకు శైత్యోపచారము సల్పెదను. ఈపాటి కామహమ్మదీయ సైనికులు సమరసింహునకుఁ జిక్కియుందురు.

జో:—లోకోత్తరా ! నమస్కారము.

పృథ్వీ:—కాంతామణీ ! నీవెవరో తెలిసికొనవచ్చునా ?

జో:—నేను ప్రస్తుతము తమ ఖైదీని.

పృథ్వీ:—నాకై దీయా ? ఎట్లు ?

సం:—ఈసుందరాంగి ఎవరు చెపుమా యింతనిర్భయముగా మాటలాడుచున్నది ! వేసముఁజూడ మహమ్మదీయాంగనవలె నున్నది.

జో:—నేను మహమ్మదీయ పక్షమునకుఁ జెందినదానను. మావారు నన్నువిడిచి స్వప్రాణరక్షణ ధురంధరులై పలాయనమైరి. నేనొంటరిగా మీకుఁ జిక్కవలసివచ్చె. కావున మీరాజధానికి నన్నుంగొనిపోయి బందాలనెట్లు శిక్షింతురో యట్లు శిక్షింపుడు.

పృథ్వీ:—అట్లనా, సరియే ! మారాజపుత్రిలు స్త్రీలెవ్వరైనఁ దమకు ఖైదీలుగాఁ జిక్కినప్పుడు సగౌరవముగా వారిని వారివారలకడ కనిపిపుచ్చెదరు. అట్టి శిక్షయే నీవిపుడనుభవింపవచ్చును.

జో:—(తనలో) ఆహా ! ఏమి యీయౌదార్యము. శత్రివనిత తనచేఁ జిక్కినపుడు సగౌరవముగా నామెను శత్రివులకడ కనిపెదననుచున్నాడు. ఇట్టి యౌదార్యసుగుణ పరాక్రమసంపన్నులగు పుత్రిలఁ గనిన హిందూదేశమునకా యీపాట్లు !

పృథ్వీ:—మే మెప్పుడును స్త్రీలను జెఱఁగొనమమ్మా! నిన్ను మీవారలకడ కనిపినందులకు మేము ప్రత్యుపకార మపేక్షింపము.

(ప్రవేశము కవిచంద్రుఁడు)

కవిచం:—జై పృథ్వీరాజునకుజై!

సం:—(స్వగత) ఏమి! ఈతఁడు పృథ్వీరాజా! కావుననే ఆ పరాక్రమము, ఆ ఔదార్యము, గౌరవ ప్రపత్తియు.

పృథ్వీ:—కవిచంద్రమా! జయచంద్రమహారాజె క్కడ?

కవి:—ఇప్పుడే సమరసింహమహారాజు జయచం ద్రుని విడిపించినాఁడు. ధనమును ప్రధాని సేనాని యాని ధీనమున నుంచి జయచంద్రుని పీడ్కొలుపుచున్నాడు. మీకీవిషయము తెలుపుమని నన్నుఁబంపినాడు.

పృథ్వీ:—కవీంద్రా! చూడుమీ స్త్రీరత్నము మహ మ్మదీయుల పక్షమునకుఁ జెందినదట. సగౌరముగా నీమెను వారికప్పగించిరమ్మా.

కవి.—చిత్తము. అమ్మా! పోవుదమురమ్మా.

జో:—పృథ్వీరాజా! హిందూదేశమాతాగర్భమున బుట్టి యీమెను గర్వితురాలిగ నొనర్చితివి. నిన్నుఁగని యీమె వీరమాతయై ధన్యయయ్యెను. నీవు నిజముగ నా దర్శపురుషుడవు. నిన్ను నేడు జూడఁగలుటచే నాజన్మము సార్థకమయ్యెను. మహారాజా! పోయివచ్చెదను.

పృథ్వీ:—మంచిది. (కవియు జోహారును నిష్క్రమింతురు.)

సం:—(స్వగతము)

గీ. లలితాశారద చంద్రమండలమునందుఁ
దనరు నవ్యసారంగలాంఛనము వోలె
ముద్దులొల్కెడి యీతని మోమునందు
మించునల్లని నూనూగుమీసకట్టు.

(పృథ్వీరాజొక ప్రక్కను సంయుక్త యొకప్రక్కను మంజరికి శైత్యోపచారములు చేయుచుందురు)

సం:—సఖా! (స్వగతము) నిగర్వచూడామణి (మంజరికదలును.) గాయమెచ్చటఁ దగిలినది?

మం:—(చేయిచూపును.)

పృథ్వీ:—(గాయమునకుఁ గట్టు గట్టఁబోవును.)

సం:—(సంభ్రమముతో) వలదు. మీరు శ్రమ పడవలదు. (మంజరి చేతికిఁ గట్టు కట్టును.)

మం:—(లేచి కూర్చుండి) ఈయన ఎవరు? తురక లేరీ? జయచంద్రమహారాజెచ్చట?

సం:—ఈయన ఢిల్లీశ్వరుఁడగు పృథ్వీమహారాజు. ఈమహావీరుఁడే తురుష్కుల నిర్జించి, మనమహారాజుని విడిపించి, అసహాయులమైయున్న మనలను శత్రువులబారినుండి తప్పించెను.

మం:—(తనలో) ఆహా విధాత ఎంత చతురుఁడు? మా చెలి నిరంతరము ధ్యానించు పృథ్వీశుదర్శన మెట్లుసంఘటించినాడు? (లేచి, నమస్కరించి) మహానుభావా! మీరు మాకుఁ జేసిన యుపకారమునకుఁ గృతజ్ఞత ఎట్లు చూపవలెనో మాకుఁ దెలియకున్నది.

పృథ్వి:—కృతజ్ఞతవడయునంతటి మహాకార్యమేదియు నేను చేసి యుండలేదు. కాని మీ రెవ్వరో తెలుపఁగూడినచోఁ దెలిసికొనఁ గుతూహలపడుచున్నాను. మీముఖవర్చస్సునుఁబట్టి మీరు గొప్పకుటుంబమునకుఁ జెందిన రాజపుత్రులని మాత్రము దెలియుచున్నది. మీ నామములు తెలుపఁ గూడినచో వినఁగోరెదను.

సం:—(తనలో) గట్టిచిక్కే వచ్చినది. వేషములు మార్చుకొంటిమిగాని పేరులు మార్చుకొనలేదే! మంజరి మరచి మా నిజనామములు దెలిపినచో వారు మమ్ము దెలిసికొందురు. ఇప్పుడు కర్తవ్య మేమి?

మం:—మహారాజా! మేముజయచంద్రుని రాజ్యము లోనివారము. ఆతడు మమ్ము కన్నబిడ్డలవలె గారవించును. మాకు నాతనియెడ గురుభావము. తమవంటి లోకోత్తరపురుషులచే రక్షింపఁబడుట మా కతిశయహేతువే యగును. కొండికలమగు మా నామములను దెలిసికొనుట తమవంటి ఘనుల కంత యావశ్యకము కాకపోయినను తా మడిగితిరిగాన చెప్పుచున్నాను. నాయీసఖునిపేరు సంజిత్ సింగు. నన్ను మంజీరసింగందురు.

సం:—(తనలో) శబాస్! మంజరీనీయుక్తి మెచ్చఁదగినది.

పృ:—సౌందర్యరాసి యగు నీ యువకునకు సంజిత్ సింగను నామముకంటె రంజిత్ సింగను నామము ఒప్పియుండునేమో?

సం:—తమకీ దాసురా—(మంజరిచేయి లాగును.) దాసునియందుగల వాత్సల్యముచే నట్లని యుండవచ్చును

గాని నాయత్నాతచేఁగాదు. (మంజరి చెవిలో నేదియో చెప్పును.)

మం:—మహారాజా! నాసఖుఁడు కృతజ్ఞతాసూచకముగఁ దమకుఁ దన ఖడ్గము పారితోషికముగ సమర్పింపఁదలచుకొన్నాడు.

పృ:—అవశ్య మట్లే చేయవచ్చును. కాని జయిచంద్రమహారాజునకు మాయెడ సౌమ్యభావము లేదేమో? అట్టియెడ మీరు మాతో సఖ్యముచేయుట మీ యజమానునకుఁ గోపకారణ మగునేమో ?

సం:—విచక్షణచణులగు తమకు నే నేమని మనవి చేయఁగలను.

గీ. వెలయు స్వేచ్ఛావిహారులై ప్రేమమెప్పు
పరుల యిష్టంబులను నవి సరకుగొనునె –
పారితోషికమునుగొని పరపుముదము
ఆప్తులను జిన్నపుచ్చుట న్యాయమగునె.

పృ:—సరే అట్లే కానిమ్ము. నీవు చూపిన రణకౌశలమునకుఁ బహూకృతిగ నాఖడ్గమును స్వీకరింపుము.

(ఖడ్గ మిచ్చును.)

సం:—మహాప్రసాదము. (పృథ్వినుండి ఖడ్గముఁ దీసికొని తన ఖడ్గము నాతని కిచ్చును.)

పృ:—మీ కోకప్పుడు మీ యజమానునివలన విపత్తు సంభవించినయెడల మా రాజధానికి మీరు నిరాటంకముగా రావచ్చును. మేము ప్రీతితో స్వీకరింతుము.

సం:—ధన్యులము.

మం:—మే మిదే సెలవు గైకొనుచున్నాము.

(నమస్కరింతురు.)

పృ:—మంచిది.

సం:—(పోవుచుం దనలో)

ఉ. చేరలమీఱుఁగన్నుఁగవ, చిందమునందమునందునట్లు, బం
గారును గేరుమేను, మరుగద్దియకుద్దియవక్షముఁ, సుధా
సారముజిల్లుపల్కులును, జందురుకందునుజూపుమోము, శృం
గారముమూర్తిగైకొనెనో, కైరవబాణుఁడుమేనుదాల్చెనో.

(తిరిగి చూచి నిష్క్రమించును.)

పృథ్వీ:—ఈ యువకుఁడు జయచంద్రుని మిక్కిలి పోలియున్నాడు. అదియునుగాక —

గీ. ఇనుము సూదంటుశిల లాగుకొనెనట్లు
జలము పల్లమునకె పారుచందమునను
జిత్తమీతనిదెసఁ జాల హత్తియుండె
హేతువేమియొకాని యూహింపఁజాల.

(తెర)




# ద్వితీయాంకము.



## ప్రథమరంగము.



(జయచంద్రునంతఃపురమునందొక గదిలో జయచంద్రుఁడు నసితుఁడు నాసనములపై గూర్చుండి యుందురు.)

జయ:—ఇంతకన్న మరివేఱే యవమానముండదు. నాయత్నము లన్నియురిత్తయగుచున్నవి. ఇంక నేనాజోక్యమే కలుగఁజేసికొనను. పృథ్వీరాజుకంటె మున్ను నే నసఫ్ఖానునిఁ దాఁకి జయించి యశశ్శ్రీఁగూడఁబెట్టవలెనని యోచించితిని. కాని నాయత్నమునకు వ్యతిరేకముగ నసఫ్ఖానునిచేఁ బట్టువడుటయేగాక పృథ్వీరాజుచే విడిపింపఁబడితిని. ఎవనిని

న్యూనత పొందింపవలెనని యేగితినో వానిచేత నేనాకు న్యూనత సంభవించెను. ఇంతకంటె నవమానముండునా ?

అసితు:—రాజచంద్రమా! దీనికై మీరింత వంతనొందఁ దగదు. జయాపజయములు దైవాధీనములు. శత్రువులు మనకన్న నధికసంఖ్యాకులగుటచే మనకు విజయము లభించి నది కాదు. మనతోఁ బోరుటచే డస్సియున్నవారలఁ బృథ్వీ రాజవలీల జయింపఁగలైను. లేనిచో నాతనిగతి ఏమగు చుండెడిదో. ఇంతమాత్రమున మనము పృథ్వీని జయింపలే మని తలంపవద్దు.

జయ:—ఔనుసుమా! మనతోఁ బోరుటచే నామహా మ్మదీయులలసిపోయిరి. అలసిపోయినవారల నవలీలనాతఁడు జయించెను. ఈవిజయము మనమే పృథ్వీరాజునకుఁ గొని పెట్టితిమి. ఆతఁడెంత యదృష్టవంతుఁడోగాని పరాజయమే యెఱుంగడు.

అసి:—సరే దానికేమిలెండు ? కాలమొక్కరీతి జరుగఁబోదు. ఓడలు బండ్లగును బండ్లోడలగును. ఇప్పుడు జయించినాడుగదా యని యింతమాత్రమున నాతఁడు త్రికృష్ణుఁడని తలంపరాదు. ఏకాలమున కేది యెట్లు తటస్థిం చునో యెవ్వరెఱుఁగుదురు? ఇంకొకసారి మన యత్నములు ఫలింపఁ గూడదా !

జయ:—ఇంకొకసారి ప్రయత్నము చేయమందువా? వలదు, అసితా! వలదు, నిరర్థకమైన యీ యుద్యమము నుండి విరమించుకొనుటయే మంచిది.

అసి:—అయ్యా! మీరు పొరపడుచున్నారు. ఒకసారి యత్నము కొనసాగనంతమాత్రమున నాకార్యమును మానఁగూడదు. పట్టినపట్టు విడుచుట యుత్తమపురుషలక్షణముకాదు. తామిప్పుడు వికలమనస్కులై యుండుటచే నట్లనుచుంటిరి కాని సావధానచిత్తులరై యోజించిన నీ యంశము తమకే విశదము కాఁగలదు.

జయ:—అసితా! నేనొక్కటి చెప్పెదను వినుము. యుద్ధముమాత్రము వలదు. దానివలన ననర్థములు పెక్కులు గలవు. కడకు జయము మనకే లభించునను నిశ్చయము మాత్రమెక్కడిది. కావున యుద్ధముమాత్రము వలదు.

అసి:—పోనిండు. యుద్ధప్రక్రియలేని యుపాయమొకటిచెప్పెదను వినుఁడు. మీరు రాజసూయాధ్వరమును గావింపుడు. మనము కేవల భగవదారాధన చింతతోడనే క్రతువు గావించుచుంటిమని నుడువవచ్చును. దానసార్వభౌమత్వము మీకు సిద్ధించును. పృథ్వీరాజుకూడ మీ యాధిపత్యము నంగీకరింపవచ్చును. ఒకవేళ నాతఁ డంగీకరింపక పోయినను

జింత లేదు. ఏలయన నాతఁడు తటస్థుఁడై యుండునే కాని తానై కయ్యమునకుఁ గాలు దువ్వఁడు. భరతఖండమునందలి తక్కిన కిరీటధారులెల్లరును మీ పాదాక్రాంతు లగుదురు. మీకా సందేహ మక్కర లేదు. ఎవఁడును మన సైన్యముల నెదిరి నిల్వ సాహసింపఁడు.

జయ:—పృథ్వీరాజుకూడ యుద్ధము చేయఁడని నీ వెట్లు నిర్ధారణ చేయగలవు? అది గాక సమరసింహుఁ డాతని దక్షిణ భుజమను సంగతి నీ వెరుఁగుదువుకదా!

అసి:—కానిండు. సమరుఁడు పృథ్వీరాజు వెనుక నుండి యే కార్యమైనను జేయునుగాని స్వతంత్రముగా నేదియుఁ జేయఁడు. పృథ్వీరాజు తాటస్థ్యమును గూర్చి మీ కట్టి సందేహ మున్నచో మనమాతని రాజసూయమునకుఁ బిలువ నేవద్దు.

జయ:—అసితా! నాకేమో యీ పనియం దెక్కువ యిచ్ఛ పుట్టుటలేదు. నీ బలవంత మెక్కువగా నున్నది. ఎట్లైనను బృథ్వి నవమానింప వలెనని యున్నది. పృథ్వీరాజు మిక్కిలి పరాక్రమము కలవాడని జనులు చెప్పుకొను నుడులు నాకుఁ గర్ణభేద్యములుగా నున్నవి. భరతఖండమున నేకచ్ఛత్రాధిపత్యము వహింప సంపూర్ణాభిలాషయుఁ గలదు, కాని అది ఎట్లు సిద్ధించును.

అసి:—రాజేంద్రా! నాయందు నీకు నమ్మకము లేదా! ఈయసితుఁడు మీయాత్మీయుఁడు సుఁడీ! మీయభిలాష తీర్చుట కీతఁడు ప్రాణములనైనఁ ద్యజింపఁగలఁడు. కావున నామాటయందు మీరు నమ్మకముంచి నేఁజెప్పినట్లు చేయుఁడు. మీసార్వభౌమత్వము స్థాపించుకొనుటకు రాజసూయాధ్వరము నిర్వర్తించుటకన్న వేఱుమార్గ ముండదు. పృథ్వీరాజు మీ సార్వభౌమత్వము నొప్పుకొనకున్నను బైకేమియుఁ దెలియఁజేయఁడు. తక్కుంగల రాజపుత్రులు తమ కిరీటమాణిక్యములచే మీపాదములు నివాళించెదరు. అట్లు కానినాఁడు వారి ప్రాణవాయువుల మత్కృపాణాస్త్రగోలును.

జయ:—అసితసింహా! నీకు నేనెంతయుఁ గృతజ్ఞుడను. నీమూలముననే నాకు సార్వభౌమత్వము సిద్ధింపవలెను.

అసి:—అయ్యా! మీ కింత విచారమేల! ఆపని నాపైఁ బెట్టుఁడు. మీచేత రాజసూయము చేయించిననాడు గాని యసితసింహుని శక్తిసామర్థ్యములు మీకు బోధపడవు. మీరింక నిర్విచారముగా నుండుఁడు. నేనిదేపోయి తత్ప్రయత్నమున నుండెదను.

జయ:—అసితసింహా! ఇంకొక్కటి గలదు. రాజసూయాధ్వరముతోఁబాటు మదీయ పుత్రికా స్వయంవరము

కూడ జరుపవలెనని యున్నది. స్వయంవరమని యంటినే కాని ఆమెను నీకేయిచ్చి వివాహము చేయవలెనని నా యూహ. నాకన్యారత్నమును బరిగ్రహించి నాకు గారాబు నల్లుఁడవై, మంత్రివై, నాపరోక్షమునఁ గన్యాకుబ్జమున కనఁగా సర్వభరత ఖండమున కేలికవై వర్ధిల్లుము.

అసి:—సరేలెండు! దానికేమి? ఆమె నన్నుఁ బ్రేమించినచోఁ దప్పక వివాహమాడెదను. కాని అసిత సింహుఁడు ప్రతిఫలాపేక్షచే మీకు సహాయపడెదనని వాగ్దానము చేయలేదుసుఁ

జయ:—అట్లు నేనెన్నడును దలఁపను. చెట్లు, మేఘుఁడు, పుడమియుఁ బ్రతిఫలాపేక్షచేత నే, ఫలములు, నీరము, సస్యముల నిచ్చుచున్నవా? సజ్జనులకుఁ బరోపకారము సహజము.

అసితు:—నాకింక సెలవు దయచేయుడు. తత్ప్రయత్నమున నుండెదను.

జయ:— జయచంద్రుఁడు నీమేలు మరువడు. పోయి రమ్మి.

అసి:—(ముందునకువచ్చి) ఇప్పటికి నా ప్రయత్నము సఫలీకృతమైనది. సంయుక్తాహస్తమునఁ గీలించుభాగ్యము

నాకు నేటికిఁ గలిగినది. సంయుక్తయే వరించినప్పుడు రాజ్యలక్ష్మి యేల వరింపదు. పాప మీతఁడు తనకు సహాయము చేయుమని పలుసారులు చెప్పుచున్నాఁడు. తన కోఱకు కాక పోయినను నాకోఱకైనను దనకుఁ దప్పక సహాయము చేసెదనని యీతఁడెరుఁగఁడు. ఈతని యభివృద్ధికిఁ బాటుపడునట్లు నటించుచు నాయభివృద్ధికై యే నేను పాటుపడెదను.

(నిష్క్రమించును).

జయ:—క్రమముగా నీరాజుల నెల్ల నావంకకుఁ ద్రిప్పికొనినఁగాని నాకార్యము సానుకూలముగాదు. ఈ యసితునకు నాతనయ నిచ్చి పెండ్లిచేసినచో నీతఁడు తప్పక నావాఁడే యగును. ఈతని సహాయమున మిగిలిన రాజుల నవలీలఁ గెలువవచ్చును. మిగిలిన రాజులు రాజ్యముకన్న వీని రాజ్యమే పెద్దది. కావున వీని నల్లునిగాఁ బడయుట మంచిదే, కాని సంయుక్త వీనిని ప్రేమించునా ప్రేమింపదా యని యాలోచింపవలసి యున్నది. ఎందులకుఁ ప్రేమింపదు? వీనికన్న మిన్నయేడీ? అదిగాక నేనామెకుఁ జెప్పియుఁ జెప్పించియుఁ జూచెద. ఇది సాగెనా మిగిలిన కార్యములు తప్పకసాగును.

(నిష్క్రమించును. తెరపడును.)

## యరంగము.

ప్రదేశము:—సంయుక్తాంతఃపురమునందొక గది.
(ప్రవేశము: సంయుక్త పృథ్వీరాజుచే నీయఁబడిన కత్తితో)

సం:—.

ఉ. ఎట్టితపంబుఁ జేసితొ యహీనగుణోన్నతుఁ బృథ్వీరాజుఁజే
పట్టుటకాక యాతనికి బాసటగాఁజని శత్రుసేనలఁ
మట్టును బెట్టినాని ససమానముగానసహాయశూరునిఁ
దిట్టను జేసినైచితివి దీప్తమహోగ్రకృపాణరాజమా.

ఉ. సంతతపృథ్వీరాజకరసారసయుక్తిఁబవిత్రమైన ని
న్నెంతయుఁ బ్రేమతోడహృదయేశునిమారుగ వక్షసీమహ
త్తింతునమస్కరింతు వినుతింతునుముద్దులుగొందుఁ
నాధరాకాంతుని చెట్టబట్టుసిరి కల్గఁగఁజేయుము నాకు
నెచ్చెలీ.

(ముద్దిడుకొనును) ఏమిది ? నావైపింత తీక్ష్ణముగఁ దిలకించెదవు ? నిన్నుఁబృథ్వీకరమునుండి బాపితినని నాపైఁ గోపమా ? లేక పృథ్వీకరమునకై నేనుకూడ యత్నించు చుంటినని నాపై నీర్ష్యయా !

(ప్రవేశము—మంజరి.)

మంజ:—నీమీద నీతండ్రికే యింతయీర్ష్యయున్నప్పుడు మిగిలిన వారి కుండుటలో నేమి యాశ్చర్యమున్నది?

సం:—నాపై నాతండ్రి కీర్ష్యయా? ఎందులకు?

మం:—అతని కిష్టములేని దానిని జేయుటచేత, నిష్టమున్న దానిని జేయకపోవుటచేత.

సం:—ఇంతవర కాతని మాట నే నెప్పుడును జవదాటలేదే?

మం:—ఇంక ముందు జవదాటవచ్చునుగదా!

సం:—ఏవిషయమున?

మం:—నీ పెండ్లివిషయమున.

సం:—పెండ్లిసమాచారమిప్పుడేమి వచ్చినది. ఇంతవరకు నాతో నతఁడావిషయమేమియుఁ జెప్పలేదే!

మం:—ఇంకముందు జెప్పను. అతఁడు చెప్పినది నీకిష్టముండదు. అందుచే నీవది తోసిరాజు చేయుదువు. అప్పుడాతనికి నీపై నీర్ష్యపొడమును.

సం:—నన్నెవరికీయుట కాతఁడు సమకట్టినాడు? స్వయంవరముచేసి స్వయంవరమునందు నాయిష్టమువచ్చిన వానిని నన్ను వివాహమాడనీయఁడా?

మం:—స్వయంవరమే చాటఁబంపునట. కాని యీ స్వయంవరమునందుఁ దానుచెప్పిన వానినే నీవు వరింపవలయునట.

సం:—అట్లైన నది స్వయంవరమెట్లగును? మా తండ్రియుద్దేశము నన్నెవరి కీయవలెనని?

మం:—ఎవరున్నారు? మనమహారాజు బహిఃప్రాణము.

సం:—అనఁగా?

మం:—అనఁగాను లేదు వినఁగాను లేదు. అసితసింహ మహారాజు.

సం:—నేనతనివరింపనిచో?

మం:—వరించునట్లు చేయుదురు.

సం:—అతనికే నన్నీయవలెనని మహారాజున కేల యింతపట్టుదల?

మం:—అతఁడు మన మహారాజునకు బహిఃప్రాణ మని చెప్పలేదా? ఆతనిమూలమునఁ దనకు సార్వభౌమ త్వము ఇంకా ఏమేమియో యుపకారములు జరుగనున్నవట.

సం:—అట్లైన నాజనకుఁడు సార్వభౌమత్వము తన కూతు నిచ్చి నిలుపునా? ఎంత యవమానకరము? నా తండ్రి బుద్ధి ఎంత మందగించినది? నే నిదే పోయి నా సంకల్పము నాతని కెఱుకపరచి యాతని నీతప్పుదారినుండి మరలించెద. (పోఁబోవును.)

మం:—(చేయిపట్టుకొని ఆపి) ఉండుము. నీ విప్పుడు పోయి యేమి చేసెదవు!

సం:— ఏమి చేసెదనా? నే నసితునిఁ బ్రేమింపఁ జాల ననియు, నామన మిదివరకే పృథ్వీరాజున కమ్ముడు వోయె ననియు, నది మరలి రాదనియు, ఒక స్త్రీ ఒకపురు షుని వరించిన తరువాత నింకొకని వరింపఁజాల దనియుఁ జెప్పి యాతని యుద్యమమును మాన్పించెదను.

మం:—నీవు చెప్పిన మాటలు విని యతఁ డట్లాచ రించుననియా నీ యూహ? నీ వట్లు చెప్పినచో నీ తండ్రి నవ్వి నీవు చిన్నపిల్లవు నీ కేమియుఁ దెలియదు, అసితునిఁ బెండ్లి యాడుము, దానివలన చాల లాభము లున్న వని

బుజ్జగించి చెప్పును. నీ వింకనుఁ బట్టుదలతోఁ వాదించినఁ గం డ్లెఱ్ఱజేసి, పండ్లు పటపటకొరికి "ఏమి నీ కింత పొగరు? చెప్పుచున్న మాట వినవు. తండ్రినైన నన్ను ధిక్కరించు చున్నావుగా! చాలించు నీ యుపన్యాసము. పో, లోనికిఁ బొమ్మ"ని కసరును. అంతియెగాని చెప్పుమాటలు విని వివే చనముతోఁ మంచి చెడ్డ లరయనేరఁడు. ఇంతకు మగవారికి స్త్రీల చిత్తవృత్తులు తెలియవు. "నస్త్రీస్వాతంత్ర్యమర్హతీ, స్త్రీణామాలోచనంవినా" అని నిర్వచించిన పురుషులకు స్త్రీలపై నెంత గౌరవము కలదో నీవే యాలోచించు కొనుము.

సం:—మంజరీ! నే నెంత హతభాగ్యురాలనే?

మం:—ఎందుచేతనమ్మా?

సం:—మనసారఁగోరిన పురుషునిఁ బెండ్లి యాడుటకు వీలు లేకుండుటచేత, స్త్రీ లోకమెంత యధఃపతితము. రాజు తన్ను వరించిననుసరే వరింపకపోయిననుసరే ఒక కన్యనెత్తు కొనిపోయి వివాహమాడ వచ్చునట. స్త్రీలు తమ తండ్రి వెదకితెచ్చిన వానినేగాని యన్యునిఁ బెండ్డియాడుటకు వీలు లేదు. నీతిశాస్త్రము, ఆచారము, మతము అను పేర నెట్టి దుష్కార్యము లాచరింపఁబడుచున్నవి! నాతల్లియే బ్రతికి

యున్న నాయభిప్రాయముఁ గనుఁగొని రాజునకు బోధించి యుండునుగదా !

మం:—ఎందులకమ్మా ! నీవింత యావేశముతో మాటలాడెదవు ? నీయాంతరంగికసఖిని నే నుండ నీకీ చింత యేల ?

సం:—నాకేమి లే. నేనెట్లును బృథ్వీరాజునే వరింతును. అందులకు నాతండ్రి యాటంకపెట్టినఁ బ్రాణత్యాగము గావించి తమ కన్యలను వారు ప్రేమించినవారినిఁ బెండ్లియాడకుండఁజేయు తండ్రులకు బుద్ధివచ్చునట్లొక నీతిపాఠమును బోధించెదను. నావలె నెందరు కన్యలీలోకమునఁ దమ తండ్రుల మౌర్ఖ్యముచేఁ బ్రేమించినవారినిఁ బెండ్లి యాడుటకు వీలు లేక యిడుములఁ బడుచున్నారో కదా !

మం:—అమ్మా ! నీవింత కుందనవసరము లేదు. నీవిప్పుడు పృథ్వీరాజునే కాని యన్యులవరింపనని నీతండ్రితోఁ గాని మరెవ్వరితోఁగాని చెప్పనవసరము లేదు. అసితుని వరింపననియు నీ వెవ్వరికినిఁ జెప్పవలదు. మీాద దైవమున్నాఁడు.

సం:—నీయాలోచనము నాకెన్నటికిని వజ్రకవచము. మంజరి సంయుక్తకొఱకుఁ బ్రాణమైన నర్పింపఁగలదని

మెన్నటియుద్ధమే చాటిచెప్పుచున్నది. (తెరలో భేరీరవము) అదిఏమి ?

మం:—రాజెచ్చటికైనఁ బోవుచున్నాడేమో! పోయి చూతమురమ్ము. రాజ్యకార్యములయందు జోక్యము కలుగఁ జేసికొనకుండఁ గూర్చుండిన లాభములేదు.

(ఇద్దఱు నడతురు.)

సం:—ఆహా! ఆపత్సమయములయందుఁ దలిదండ్రుల కంటెను దదితరబంధువులకంటెను జెలులేకదా ఎక్కువ సహాయముచేయువారు

గీ. బంధువులు గూడవినరాని పల్కులైన
వినఁగ నర్హలు సమయంబువెలసెనేని
జీవములనైన నర్పణసేయఁగలరు
చెలులఁ బోలినవారలు కలరెధరను.

(తెర.)

## తృ తీ య రం గ ము.

(ప్రదేశము జయచంద్రునంతఃపురము, ప్రవేశము మంజరి.)

మం:—అబ్బా! ఏమిగడబిడ యీ రాజమందిర మున? ఇదియంతయు రాజసూయయాగ ప్రయత్నమే కాబోలు. యుద్ధముఁబో నెచ్చటఁజూచినను గనఁబడని యీ యసితసింహుఁ డిప్పు డెక్కడఁజూచినను దానే కనఁబడు చున్నాడు. పాపమీతఁడు కన్యాకుబ్జమునకును సంయుక్తకును గూడ నధిపతిగాఁగలననిఇంత పట్టుదలతోఁబనిచేయుచున్నాడు. ఈనీచుని సహవాసమెచ్చినతరువాతనే మామహారాజుబుద్ధి బుగ్గియైనది. సంయుక్తాంతరంగిక స్నేహితురాలనగుటచేనీతఁడు తప్పకనన్నుఁ బలుకరించును. సరే! ఏమిచెప్పునోచూతము! ఆతనిదృష్టిపథమునఁ బడియెద. అదే యాతఁ డిటువచ్చు చున్నాడు.

అసి:—(ప్రవేశించి) ఓహో! అంతఃపుర పరిచారిక మంజరియా?

మం:—దేవరవారికి నమస్కారము.

అసి:—కల్యాణమస్తు.

మం:—అప్రియత్నముగా నొక్కొక్కప్పుడు మనమునన్న కోరికలు వాగ్రూపమున బయలువెడలును గాంబోలు.

అసి:—నీమాటలు నాకర్థమగుటలేదు.

మం:—ఎట్లర్థమగును. ఇంకఁ గొన్నిదినములేగిన పిమ్మటమేము బొత్తిగా జ్ఞాపకముండము.

అసి:—ఇది మొదటిదానికంటె నెక్కువ క్లిష్టముగా నున్నది. అనఁగా నెప్పుడు జ్ఞాపకముండరని నీయభిప్రాయము ?

మం:—కల్యాణానంతరము.

అసి:—ఎవరి కల్యాణానంతరము ?

మం:—ఇంకెవరిది ? మీాకల్యాణమే. లేనియెడల నీప్రియత్నములన్నియు నెందులకు ?

అసి:—నాకల్యాణమనెదవేమి ? మీా యువరాజ్ఞి కల్యాణమనము. సంయుక్తా కల్యాణమనుము.

మం:—సంయుక్త మిమ్ములనే వరించునప్పుడది మీా కల్యాణముగాదా ?

అసి:— స్వయంవరమున సంయుక్త నన్నే వరించునను నమ్మకమేదీ ? ఆమె యెవ్వరినైన వరింపవచ్చును.

మం:— ఆమె అట్లేలచేయును. రూపవంతుఁడు పరాక్రమవంతుఁడు నగువరుని విడిచి యన్యునేల వరించును ?

అసి:— అట్లైన నామె నన్నే వరించెదనని నీతోఁ జెప్పెనా ?

మం:— నేనుజెప్పినఁ దమరు నమ్మెదరా ? ఆమె మీవలన మిక్కిలిపరితపించుచున్నది. అసఫ్ ఖానుతోడి యుద్ధమైన నాటనుండియు నామె మిమ్ములఁదలఁచి వగవనిగడియ లేదు. మీపరాక్రమము శౌర్యము నామె కర్ణాకర్ణిగ విని యున్నది.

అసి:— మంజరీ! ఈముక్తాహారమును బహూకృతిగాఁ గొనుము. చూడుము మీదేవి సౌధాగ్రమున నిలచిన దెవ్వరు ?

మం:— (తనలో) మాచెల్లెలు కుంజరినిఁజూచి యీతఁడు సంయుక్త యనుకొనుచున్నాడు. సరే! యనుకొననిమ్ము. (ప్రకాశముగా) సంయుక్తాకుమారియై యుండవచ్చును. మీమోముఁ జూడ నోడికాబోలు నామె యిప్పుడే లోనికేగినది.

అసి:—అవును. ఈదృశ్య మెన్నటికిని నా మనసుఁ బాయఁజాలదు.

సీ. వరసౌధఖేలన పరసతీ వదనంబు
చదలఁ బొదలు పూర్ణచంద్రుఁ గేర
నతిసుందరాభ్యంత రావాసగమనంబు
వన విహార మరాళపటిమఁ దెలుప
రయజవాతోద్ధూతరమణీయ చేలాగ్ర
మతను కేతనరుచి నపనయింప
నతికాంత సలతాంతవితతా త్యసిత వేణి
మణియుక్త ఘనఫణిఫణితిమించ

గీ. పరిహసిత మృదుపల్లవ పాదసీమ
మంజుమంజీరనాదంబు మదనువిజయ
భేరికా ఘననినదంబు తీరు కనఁగ
నింతినను జూచి లోపలి కేగెనిపుడు.

మంజరీ! మీరాకుమారి నడిగితినని చెప్పుము. నాకుఁ దొందరపనియున్నది. పోయెదను. (నిష్క్రమించును.)

మం:—(తనలో) అబ్బా! ఏమి వర్ణనము! ఈ మహాధుఁడు సంయుక్త తనదనియే తలఁచుచున్నాఁడు. వీని నిట్లే యనుకొననిమ్ము. అదియే మారాజపుత్రిక కెక్కువ

క్షేమదాయకము. పృథ్వీరాజు స్వామి ప్రేమించుచున్నదని తెలిసినచో వారిలో నొక్కరికిఁగాని, యిద్దఱకుఁగాని యపాయములు వాటిల్లవచ్చును. నే నిప్పుడే పోయి యీ సంగతి మారాజ పుత్త్రికకు నివేదించెదను.

(నిష్క్రమించును. తెరపడును.)

# సంయుక్త

## చతుర్థరంగము.

ప్రదేశము:— ఢిల్లీలోఁ బృథ్వీరాజు నుద్యానవనము.

ప్రవేశము:—పృథ్వీరాజు సంయుక్తచే నీయఁబడిన కత్తితో.

పృథ్వీరాజు:—గజినీమహమ్మదుకున్నలెఁ గాక యీ ఘోరీమహమ్మదునకు రాజ్యతృష్ణ మిక్కుటముగా నున్నది. అందుచేతనే యీతఁ డెన్ని పర్యాయము లోడిపోయిన నీ దేశపు వాయవ్యము సరిహద్దులలోఁ దానుండి, తన సేనాధిపతులైన అసఫ్‌ఖాను కుతుబ్‌దీనులును దేశమునుఁ గొల్లగొట్టుటకుఁ బంపుచున్నాఁడు. జయచంద్రుఁడు పాపము నా స్నేహమున కంగీకరింపకపోయినను అసఫ్‌ఖానుని బ్రతిఘటించి నిలచెనే కాని శత్రువులతోఁ జేరలేదు. ఆహా! యుద్ధము లెంత భయావహములు! మొన్నటి యుద్ధమున నెంతమంది యసువులఁగోల్పోయిరో లెక్క లేదు. పుడమిపైఁ గల యాహారపదార్థములు తక్కువయై జనసంఖ్య యెక్కువైన నప్పుడు యుద్ధములు మున్నగునవి వచ్చి కొంతమంది చని పోవుదు రని గ్రంథములందుఁ జదివితిని. ఇట్టి అనర్థదాయకములగు యుద్ధములువచ్చి, యున్నవారిలోఁ గొంద ఱూడి పోవుటకంటె నెక్కువమంది పుట్టకయుండిన బాగుండెడిది. అట్టి జనన నిరోధకమార్గములఁ గనిపెట్టి యెవరైన నీప్రజ నుద్ధరింపరాదా? భయంకరములగు యుద్ధములే నాజన సంఖ్యను దక్కువపఱచుటకుఁ గల మార్గము?

చతుర్థ రంగము

సీ. ఎగుమతి దిగుమతు లెల్లను నిలుచును
ధాన్యాధులకు నెల్ల ధరలు హెచ్చు
పరసైన్యపదహతిఁ బంట భగ్నంబగు
నిరకౌను దేశంబు కరవునకు
బురుషసమూహంబు పోలియను మొదలంట
లెక్కకు స్త్రీసంఖ్య యెక్కుడగును
విషయంబునఁ గల విత్తంబు వ్యయమగుఁ
బన్ను లేమియు రావు ప్రజలనుండి

ఆ. వె. సమసిపోవువిద్య, శాస్త్రంబు లడుగంటు,
గళకళావిహీనగతిని బొందు,
దేశమెల్ల శోక దేవతానిలయము గా
నమితకష్టదంబు లాహవములు. (కూర్చుండును.)

కాని మొన్నటి యుద్ధమప్పటినుండియు నాకా యువకుడే జ్ఞప్తికి వచ్చుచున్నాడు. ఏమి యాతని విక్రమక్రమము? వేటాడుతునియలుగఁ బోరినాడే? నే నిదివర కెందరో శూరుల సమరాంగణమునఁ జూచి యుంటిని కాని యా వీరున కీడగు వాఁడు నెందునుఁ జూచి యెఱుఁగ. ఆతని పేరు సంజీత్ సింగట. కృతజ్ఞతాసూచకముగ నాతఁడీ ఖడ్గమును నాకు బహూకరించి యున్నాడు. (ఖడ్గము నొరలోనుండి దీసి) ఈ ఖడ్గము సుందరముగా నుండుటయే గాక మిగుల భారముగఁ గూడ నున్నది. (పరిశీలించి) ఇదియేమి? దీని మీద సంయుక్త అని యున్నది? సంయుక్త జయచంద్రుని తనయ కాదా? ఆమె ఖడ్గ మీ వీరున కెట్లు చిక్కెను?

ఓహో! ఒకవేళ నారాజకుమార్తె యాతనిఁ బ్రేమించి యాతనికీ ఖడ్గమునిచ్చి యుండెనేమొ! అట్లైన నాతఁడు దానిని భద్రముగా నుంచుకొనక నాకేల యిచ్చె? నా యందు భక్తిచేతనా? లేక సంయుక్త నాత డంతగాఁ బ్రేమించి యుండలేదా? కాని సంయుక్త, సంజిత్ సింగ్, ఈ నామములయందు నాకేమో సాదృశ్యము స్ఫురించు చున్నది. ఆతని కంఠస్వరముకూడ స్త్రీకంఠస్వరముఁవలె నున్నది. గమనవైఖరియు స్త్రీలనే యనుకరించుచున్నది. జయచంద్రుని పోలికకూడ స్పష్టముగఁ గానవచ్చుచున్నది. ఒకవేళ బురుషవేషమున నున్న సంయుక్త కాదుగదా ఆ యువకుఁడు? అట్లైన నీబహూకృతి కేవల కృతజ్ఞతాసూచ కము మాత్రమే గాక ప్రేమసూచకముకూడ కాదుకదా! స్త్రీయైన యెడల నట్టి విక్రమమా? ఏమో ఇది యంతయు నాకింద్రజాలముఁవలె నున్నది.

(ప్రవేశము కవిచంద్రుఁడు).

పృ—కవిచంద్రా! ఇటురమ్ము. ఇచ్చటఁగూర్చుండుము.

కవిచం—

ఉ. బంగరుతమ్మి పూవులన భాసిలువాలికకన[illegible]దోయి య
రాంగనిమీలనంబుగ ననాత్మయు సుస్థిరభావమ[illegible]నని
న్నుంగడు గాఢయోచనమున [illegible]జేసిన దేసమస్య, రా
జ్యాంగసమస్యయా కవితయా చెలికానికిఁ జెప్పరాదొకో.

పృ:—నేను రాజునగుటచే రాజకీయమును, నీవు కవివగుటచేఁ గవిత్వమును మాత్రమే నీదృష్టిపథము నగోచ రించుచున్నవి కాఁబోలు?

## చతుర్థ రంగము.

కవిచం:—గాఢముగా నాలోచించుటచే నట్లను కొంటిని. అవి రెండును గాకున్న మరి ప్రేమయొక్కటియే మనము నిట్లు గాఢాలోచనకులోఁ బరచు శక్తిగలది.

పృ:—

చ. చెలువగు బాహ్యసృష్టిపరిశీలన మాత్రమె కాక హస్తగా
మలకపరీక్షరీతిఁగను మానవహృత్పరిశీలనంబును
న్గలిగిన నేకవీశ్వరుఁడు నాఁబడు శక్తులు రెండునీవుని
చ్చలుఁగలవాఁడ వౌటఁగవిచంద్రుడువై తివిమిత్రరత్నమా

కవులు కేవలకవులే గాక రాజులకాంతరంగికమిత్రులును బుద్ధిఁగఱపుమంత్రులునుగూడ నగుదురు.

కవిచం:—ఈయుపోద్ఘాతమంతయు నెందులకో ?

పృ:—నీవు నాకిప్పుడొక సాయము చేయవలసి యున్నది.

కవిచం:—నేనప్పుడే యనుకొంటిని. ఏవిషయమున ? ప్రేమ విషయముననే! కానిండు! అదేదియో వినఁగుతూహల పడుచున్నాడ.

పృ:—(కత్తినిఁ జేతికిచ్చి) దీనినిఁ బరిశీలింపుము.

కవి:—(పరిశీలించి) "సంయుక్త" యని యున్నది. దీనిని దమకెవరిచ్చిరి ? సంయుక్తయా ?

పృ:—అసఫ్ఖాను నెదిరించుట కడవికిబోయినప్పుడు జయజంద్రుని సైన్యమునకు సంబంధించిన యొక దళాధిపతి నాకిచ్చియున్నాడు.

## సంయుక్త

కవి:—జయచంద్రుని తనయ పేరు సంయుక్త. ఇప్పు డామెకే గదా స్వయంవరము చేయుచున్నారు? ఆమె ఖడ్గ మావీరున కెట్లువచ్చినది చెపుమా?

పృ:—అదియే నాకును దెలియలేదు. ఆమె యా యువకుని ప్రేమించి యాఖడ్గము నాతనికిచ్చి యుండునా?

కవి:—ఆయువకుఁ డెట్లుండెను?

పృ:—ఆయువకుఁడు చంద్రునకు వంకలు దిద్దుపోయ గమువాఁడు.

కవి:—నేనేమి మిక్కిలి యందగాడనా? నాకు వంకలు దిద్దుటకు?

పృ:—చంద్రుఁడన్న నీవు కాదు. తారాపతి.

కవి:—చంద్రుఁడు తారకుఁ బతి కాఁడు. ఉపపతి.

పృ:—నీచమతకృతుల నికఁ గట్టిపెట్టి ప్రకృత విషయమును గూర్చి మాటలాడుము. ఆయువకునకును సం యుక్తకును గల సంబంధ మేమయి యుండును?

కవి:—ఉ. మీరననిట్లతండు శశిమీఱు సొబంగుగలాడయేని యీ కైరవపత్రనేత్రితకుకమ్మన హానివరించియుండు,

పృ:—కాని యతఁడు చెప్పిన పేరునకును పిడికైనున్న పేరునకును సాదృశ్యము లేకపోలేదు. మరియునాతనియందు స్త్రీలక్షణంబులును జయచంద్రుని పోలికయుఁ గూడఁగలవు.

కవి:—

మారుకనోజపాలుని కుమారియొయేమొయటంచుఁ దోచుఁగ న్యారణరంగయానములు నవ్యము లేమన భారతావనిన్.

పృ:—ఆయువకుఁడే సంయుక్తయైనచో నబహుకృతి కేవలకృతజ్ఞతామాత్ర సూచకమేనా?

కవి:—ప్రేమసూచకముకూడఁ గావచ్చును.

పృ:—మరి దీని నిర్ధారణ తేలుట యెట్లు?

కవి:—కన్యాకుబ్జమునకేగి సంయుక్త మనము నరసి రమ్మని సెలవా?

పృ:—మరి నీసామర్థ్యమును జూచెదను.

కవి:— సరే మీసంశయమును దీర్చెదను. నిశ్చింతమై నుండుడు.

పృ:—శబాస్! కవిచంద్రా? నీయట్టి స్నేహితు లున్నగదా! రాజునకు మంగళము.

కవి:—(కొంచె మాలోచించి) యొక కమ్మపై నేదియో వ్రాసి పృథ్వీరాజునకిచ్చి ఈసమస్యను దాము పూరించి నాకిండు.

పృ:—(కొంచెమాలోచించి సమస్యను బూరించి కవిచంద్రునకిచ్చును.)

కవి:—(అందుకొని) ఇంకనాకు సెలవు దయచేయుడు. పోయివచ్చెదను.

పృ:—మంచిది. (కవి నిష్క్రమించును. తెర)




# తృతీయాంకము.

## ప్రథమరంగము.

ప్రదేశము:—జయచంద్రుని దర్బారు.

ప్రవేశము:—జయచంద్రుఁడు, మంత్రి జయంతుఁడు.

జయంతు:—దేవర సెలవిచ్చినట్లు ప్రయత్నములన్నియుఁ గావింపఁబడినవి. వలయువస్తుసామగ్రి యావత్తును సేకరింపఁబడినది. గంగానదీతీరమున యాగశాల నిర్మింపఁబడినది.

జయచం:—సరే! ఇఁక నాహ్వాన పత్రికలలిఖించి వివిధరాజన్యులకంపుడు. ఆ! ఢిల్లీకి మాత్రమాహ్వానమంప

వలదు. తెలిసినదా! సమరసింహునాహ్వానింపవచ్చును. తరువాత నింకొకటి. ఆతనికి మిక్కిలివిలువగల కానుకల నంపుడు.

జయంతు:—చిత్తము.

సేవకుఁడు:—(ప్రవేశించి) జయము జయము! దేవా! ద్వారమునొద్ద రాజపురోహితులు వేచియున్నారు.

జయచం:—త్వరగాఁ బ్రవేశపెట్టుము. మంత్రివర్యా! ఆహ్వానపత్రికలలో లిఖించుటకు వీలుగానుండునట్లిప్పుడే ముహూర్త నిశ్చయముకూడఁ గావింపఁబడగలదు.

(ప్రవేశము పురోహితుఁడు. జయచంద్రుఁడు మంత్రియు లేచి నమస్కరింతురు.)

బ్రాహ్మ:—దిగ్విజయమస్తు! మనోవాంఛాఫలసిద్ధిరస్తు.

జయచం:—బ్రాహ్మణోత్తమా! ఆయాసనమలంకరింపుడు.

(బ్రాహ్మణుఁ డాసీనుఁడైనతరువాత రాజును మంత్రియు నాసనములపైఁ గూర్చుందురు.

జయచం:—ఆర్యా! ప్రశ్నచూచి నేను తలంచిన కార్యమగునో కాదో నిశ్చయింపుడు.

బ్రాహ్మ:—(యోచించి) బహుచక్కగా అవుతుంది ఎందుచేతంటే చూశారా? ప్రశ్నాధిపతికి అనగా దశమాధిపతికి ఉచ్చలగ్నాధిపతితో సంబంధం. గురుదృష్టి. ఇంకేమి కావలె? పైగా ఇప్పుడు నన్ను కర్మవిషయమై పృచ్ఛచేశారు. గోచారరీత్యాయిపుడు దేవరవారికి మఖకాదూ! మఖ పుబ్బ ఉత్తరాఃపాదంసింహం. ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు. ఎనిమిది, తొమ్మిది, పది, పదకొండు, పన్నెండు, మూడింట శని, ఆరింట రాహువు, ఏకాదమందు రవిగురులు. దశమమందు శుక్రుడు. ఓ చాలా దివ్యంగాఉంది. తలంచినపని తప్పకుండా అవుతుంది. ఇపుడు రాహు మహాదశ కాదూ? రాహువు ప్రబలకర్మ యోగకారకుడు. తప్పకుండా చేయిస్తాడు. ఏదోకర్మ తలపెట్టారే? ఏదేనా క్రతువు లిప్తలమీదజరిపిస్తాడు. పైగా అవబృధస్నానయోగం ఉంది.

జయచం:—అదేనండీ! ఇపుడొక క్రతువు తలపెట్టినాను.

బ్రాహ్మ:—ఓ! తలపెట్టండీ! ఒకటికాదు శతక్రతువులు చేయవచ్చును. రాహువు ప్రబలకర్మయోగకారకుడు.

జయచం:—చిత్తము.

బ్రహ్మ:—అయితే ఏలినవా రిపుడు ఏక్రతువు చెయ్యాలని.

జయంతు:—మహారాజుగా రిప్పుడు రాజసూయము గావింపవలెనని యున్నారు.

బ్రాహ్మ:—బాగుంది. అవశ్యము చేయవచ్చును. ఎక్కడనో యీలాంటి ధర్మప్రభువులు తప్ప యజ్ఞచింత యున్నవారు లరదు. ఇకముందు యజ్ఞములే యుండవు యీకలియుగంలో చెయ్యాలండీ యజ్ఞాలు చెయ్యాలి. యజ్ఞోవైవిష్ణుః అని శృతి. యజ్ఞమే విష్ణువు. యజ్ఞంచేస్తే విష్ణువు నారాధించినట్లు. అల్లాంటి యజ్ఞములు చేయడం లేదు సరేకదా ! పైగా దేవుడే లేడని మొదలు పెట్టారు మనవాళ్లు కొంతమంది వాదన. బౌద్ధచార్వాకాది దుర్మత ములు ప్రబలి యింతవరకు తెచ్చాయి. పూర్వ దినాల్లో ఎందుకు. తియ్యండేదైనాపురాణం పత్రాలన్నీకూడా తేతా గ్నులకాకకు ఎండి పెళుసై యజ్ఞధూమమారుటచేత నల్లబడి నట్లుంటాయి.

జయ:—అయితే బలసంపన్నమగు ముహూర్తము నొకదానిని నిశ్చయింపుడు. ఎప్పుడు యారంభము గావిం పవలెనని తెలవు ? పంచాంగము తెప్పింతునా ?

బ్రాహ్మ:—ఎందుకండీ. పంచాంగం అంతాహ్యాత్కవి లే! ఇప్పుడు సింహమే చాలా బలమైనలగ్నం. లగ్నమం దెవరూ లేరు. తృతీయమందు కుజశనులు. షష్ఠమందు రాహువు. దశమమందు బుధశుక్రులు. ఏకాదశమందు రవి గురులు. చూడండి పాపగ్రహము లన్నియు ఉపచయము లందును, శుభగ్రహము లన్నియు కేంద్రకోణముయందును ఉన్నవి. పైగా ఏకాదశ మందు సూర్యుడుంటే ఎన్నిదోషా లున్నా పోగొడుతాడూ అని శాస్త్రం. దశమాధిపతికి స్వక్షేత్రం. లగ్నాధిపతికి ఏకాదశస్థితి. గురుసంబంధం. పైగా శుభకార్యములకు వసంతఋతువు మంచిదన్నాడు కనుక రేపు జ్యేష్ఠశుద్ధదశమీ శుక్రవారంనాడు హస్తానక్షత్రయుక్త సింహాలగ్నమందు పుష్కరకు అనఁగా ఉదయాది ఎంతవుతుందంటే మిథునంలో భుక్తిపోనూ 4-బి, కర్కాటకము 5-17, సింహం 3-1, 12-47 విఘడియలకు చాలా బాగుంది. కనుక పత్రికలలో ఆలావ్రాయించండి, అప్పుడు ద్వితీయమందు పూర్ణచంద్రుడు, హస్తమీకు మఘ పుబ్బ, ఉత్తర, హస్త, క్షేమతారాతుంది. తారాబలచంద్రబలాలు బాగున్నాయి. తిథిఒకటి, వారం 6, నక్షత్రంనాలుగు, లగ్నం 5, ఒకటి ఆరుఏడు, ఏడునాలుగు 11, పదకొండు ఐదుపద హారు, తొమ్మిదిపోతే ఏడు. పంచకరహితం కూడాను.

జయం:—శుభ కార్యములకు వసంతర్తువు మంచి దంటిరే! జ్యేష్ఠమాసమువరకు నాగిన వసంతర్తువు వెడలి పోవునే?

బ్రా:—"మాఘాద్యాః పంచవసంతాః" అన్నాడు. మాఘమాసం లగాయతు జ్యేష్ఠమాసంవరకు ఈఐదుమాసములు వసంత ఋతువు కిందే లెఖ్ఖ.

జయ:—సేవకా! తాంబూలముఁ గొనిరమ్ము.

బ్రా:—దశమినాడు సాగించుడు. కార్యం అమోఘముగా అవుతుంది.

జయ:—ఆభారం తమదే!

(సేవకుఁడు కొనిరా బ్రాహ్మణునకుఁ దాంబూల మిచ్చును.)

బ్రా:—శతక్రతు ఫలసిద్ధిరస్తు. నేనుపోయివచ్చెదను.

జయ:—చిత్తము. మాకిక సెలవు దయచేయుడు.

(బ్రాహ్మణుఁడు నిష్క్రమించును. తెర పడును.)

---

## ద్వితీయరంగము.



అంతఃపురమునం దొకగది. ప్రవేశము సంయుక్త.

సం:— అవును. అది యేకారణమై యుండవచ్చును. భరతఖండమునం దిప్పు డున్న పెద్దరాజ్యములు నాలుగు. తద్రాజ్యాధిపతులు నా జనకుఁడు, సమరసింహుఁడు, పృథ్వీరాజు, అసితసింహుఁడును. తక్కుంగల రాజ్యాధిపతు లిందులో నేయొక్కనికైనఁ గప్పము కట్టువారలే. ఇందు జయచంద్రునకు సార్వభౌమత్వము రావలెనన్న మిగిలినవారల నాతఁడు జయింపవలెను. అందులకే యాతఁ డసితునితో సంబంధము గావించి, యాతనిఁ దన యాప్తునిగా జేయనుద్దేశించినాడు. సమరసింహునకు బహుశః లంచమిచ్చి తనవైపునకుఁ ద్రిప్పుకొనఁ బ్రయత్నించునుగాఁబోలు. అప్పుడు నా తండ్రి పృథ్వీరాజు నెదిరించును గావలయు. అయ్యో! నా తండ్రి యెంత వెఱ్ఱివాఁడు! నాయిష్టమునుఁ గనిపెట్టి పృథ్వీరాజునకు నన్నిచ్చి వివాహము గావించి లోకోత్తరుఁడగు నావీరు నల్లునిగాఁ బడసిన నాతఁడు తనయెడల సఖ్యము వాటించునే! అప్పుడు త్రిదశులకైనఁ దన్నుఁ దేరిచూడ వీలుండదుకదా! నా తండ్రి సార్వభౌమపదకాంక్షచే నంధుఁ

డై యున్నవాఁడు. మౌర్ఖ్యము, ప్రతిహింస, దురాశ, తప్ప నాతని కన్యము కానరాదు. రాజనీతి యావంతయుఁ గానఁడు. లేకున్నఁ బృథ్వీరాజువంటి బలవంతునితోఁ బగ సాధింతురా? లేక చెలిమి వాటింతురా?

(ప్రవేశము జయచంద్రుఁడు)

జయ:—అమ్మా! ఏ మాలోచించుచుంటివి?

సం:—ఆఁ! ఏమియు లేదు. ఆకాశమునఁ గారు మబ్బులు దట్టముగా నలముకొని యున్నవి. గాలి ప్రబల ముగా వీచుచున్నది. కొంచెము తుషారముకూడ పడు చున్నది. ఈ చినుకుచినుకు గాలివానగా మారునా లేక యీగాలిచేత వాన తేలిపోవునా యని యాలోచించు చుంటిని. చూడు డింత గాఢాంధకారములోఁగూడ మధ్య మధ్య వెడలు విద్యుల్లతలవలన పట్టపగలునందువలె సర్వ వస్తువులు స్పష్టముగాఁ గానవచ్చుచున్నవి.

జయ:—సరే! ఈవ్యర్థకాలయాపనమున కేమిఁగాని చూడు. రాఁబోవు దశమీ శుక్రవారమున రాజసూయ ప్రారంభము జరుగును, తెలియునా?

సం:— తెలియును. మంజరివలన వినియున్నాను.

జయ:—ఆఁ! అన్నట్లు మరచితిని మంజరి నిన్నెప్పు డును వెన్నంటి యుండునుగదా! అది యేది ఇప్పుడు?

సం:—పండుకొనినది కాఁబోలు.

జయ:—ఏ మంత వేగముగాఁ బండుకొనినది.

సం:—వేగముగాఁ బండుకొనక దానికేమి? నిర్వి చారకదా?

జయ:—నీకు మాత్ర మేమి విచారము?

సం:—విచార మేమియు లేదు. క్రతువు నిర్విఘ్న ముగ సాగునా లేదా యని యోజించుచుంటిని. రాజు లెవ్వరైన లోఁబడక పోయిన నెట్లాయనియనుకొనుచున్నాను. ఇదివరకు యుద్ధములోనే చాల సైన్యము నష్టమయినది. ఇపుడు మరల యుద్ధము తటస్థించిన మరికొంతసైన్యనష్టమే?

జయచం:—నీకా భయ మేమియు నక్కర లేదు. రాజాయినిత సింహుఁడు నాకు బాసటమై యున్నవాడు. రాజులందఱ కాతని పేరిశ్వర వేరు వంటిది. ఆతని నీ వెప్పడైనఁ జూచితివో లేదో కాని మిగుల శౌర్యబలపరాక్రమ సంపన్నుఁడు. మొన్న తురుష్కులతోడి యుద్ధమున నాతఁడు సలిపిన వీరవిహార మసమాన్యము.

సం:—లోకమున నిట్టి భుజావిక్రమము కలవారరుదు గనుందురు.

జయ:—రాజసూయ యాగానంతరము నీ పెండిలి కూడ సలుపవలెనని యున్నది. యాగార్థము రాజులందఱు వచ్చెదరు కనుక యాగము ముగిసిన వెంటనే స్వయంవరము జరిగించెదను. వారిలో నీ యిష్టమువచ్చినవానిని వరింపుము.

సం:—జనకా! నా వివాహమున కంత తొందర యేల? రాజసూయమయిన తర్వాత కాలక్రమమున జరిపింతురుగాని!

జయచం:—అమ్మా! అట్లనెదవేమి? మరల నింకొకసారి యీరాజలోకము నంతయు నొక్కచోఁ గూర్పవలెనుగదా! అదియునుఁ గాక నీకు వివాహ యోగ్యమగు వయస్సు రాలేదుగనుకనా!

సంయుక్త:—కాదుతండ్రీ! నాకేమో వివాహము చేసికొని యత్తవారింటి కేగవలెనని లేదు. ఇంకను దండ్రివగు నీయొద్దనే కొంతకాలముండవలెనని యున్నది.

జయ:—చిన్నప్పటినుండియు బెంచినదానఁజేసి నన్నుఁబాయలేనని చెప్పుచున్నావు! కాని యెంతకాలమిట్లాడ పిల్ల

నింటియందుంచుకొనుట ! ఆమె యొకరిసొమ్ము వివాహము చేసి యామె నత్తవారింటికిఁ బంపవలెను. ఎదిగినపిల్ల నింటి యందుంచుకొనుట తండ్రికిఁ దగదు.

సం:—మగవారికి వలె నాడు వారికిఁగూడ నవివాహితలుగా నుండుటకు స్వేచ్ఛ లేదుకదా !

జయ:—సంఘమునకు వెఱవవలెను. అట్లు చేయుటకు వీలు లేదు.

సం:—అయ్యో యెంతగొప్ప వారుసయితము సంఘమునకు వెఱచి ఎట్టికానిపనులు చేయుచున్నారు. మగపిల్లలకు వలె నాడుపిల్లలకుఁగూడఁ దనయాస్తినిచ్చి వారినింటనుంచుకొనుటకు దండ్రికి హక్కు లేదుగదా !

జయ:—అమ్మాయీ ! ఇప్పుడీవృథావిషయచింతనముతోఁ గాలము వెళ్ళఁబుచ్చిన నేమియులాభము లేదు. ఇప్పుడొక మంచి సంబంధమున్నది. అది దాటిపోవునేమో యని నేనింత తొందరపడుచున్నాను. ఇప్పుడు నేను జెప్పిన యసితసింహుఁడన్న వాఁడే యాతఁడవివాహితుఁడు. మిక్కిలివిస్తీర్ణమయినరాజ్యమున కధిపతి. అతని నీవువరించితివో మిక్కిలి సుఖపడఁగలవు. మీఁదుమిక్కిలి యాతఁడు నాకుఁగడుఁ గూర్చువాఁడు. అంతకంటె నెక్కువగుణాలయుఁడైన రాజులీ

భరతఖండమున లేరు. కనుక స్వయంవరమున నీవు పొరబడక యాతనినే వరింపుము. అతని యాత్కృష్యము నీపాటికి నీవు మంజరివలన వినియుందువు.

సం:—తండ్రీ! నాకిప్పుడు వివాహమువలదు. నా మాటవిని స్వయంవరము నిలుపుము.

జయ:—తల్లీ! అట్లుచెప్పకుము. ఇప్పుడుకాకపోయిన నెప్పుడైనను వివాహము కాకతీరదు కదా!

సం:—తండ్రీ! నాకువివాహముపై నిచ్చ లేదు. ఏమందువా?

ఉ. పారము లేనియట్టి రసపానము నాటకమందుభూమి కా
ధారులసొమ్ముకాదుగద తాఁగను వారలసొమ్మె కాని సం
సారమునందునట్లె మనుజన్ములుతద్ధృఢబంధయుక్తులై
యారయ నేరరందలి గుణాగుణముల్ గను వారిపోలికన్.

జయ:—అమ్మా! నీ కళాభిరుచి నే నెఱుంగుదును. పెండ్లియాడకున్న నీవయోరూపవిభ్రమములడవిఁ బూచిన పువ్వులవలె నిరుపయోగ్యములగును. కావున బెండ్లియాడి తీరవలయును. ఈసమయముదాటఁబెట్టిన నింతమంచి సంబంధము మనకు మరలదొరకదు.

సం:—అప్పటికిఁ దగిన సంబంధమప్పుడు దొరుకును.

జయ:—అయిన నీవిప్పుడు పెండ్లిచేసికొనవా ?

సం:—చేసికొన్నను అసితుని మాత్రము వరింపఁ జాలను.

జయ:— ఎందుచేత ?

సం:— నేనాతనిఁ బ్రేమింపకపోవుటచేత !

జయ:— ఇప్పటినుండి యాతనిఁ బ్రేమింపుము.

సం:—అది నాచేతఁగాదు.

జయ:— కారణము ? అసితునిఁ గాక వేఱొకనిఁ బ్రేమించి యుంటివా ?

సం:—అదియేమో నేనిప్పుడు చెప్పఁజాలను.

జయ:—తల్లిలేని పిల్లవుకదాయని చనవిచ్చినందులకుఁ దగిన పని చేసితివి. చదువుకున్నందుల కిదికాఁబోలు ఫలము ! తండ్రిమాట యింతపాటింపని దానవౌదువని తలంపనైతిని. పెండ్లిచేసుకొమ్మంటిని. నిన్నేమి దుంగములు దూలములు మోయుమంటినా ? అసితునిఁ బెండ్లియాడి చేదు మేసెదవు గాఁబోలు ! చాలింపుము నీ యాగడములు ! ప్రేమించ లేదట ! అందుచేతఁ బెండ్లియాడదఁట ! మేమందఱము ప్రేమించియే కాఁబోలుఁ బెండ్లిచేసికొంటిమి ! తండ్రి కూతు పెండ్లిసంబంధముఁ జూచినప్పుడు మంచిది చూడదు కాఁబోలు. స్వయంవరమనుచు నొకటి పెట్టి రాచజాతికింత

స్వేచ్ఛయిచ్చినదే తప్పు. నీవంటివారల కధికారమిచ్చిన యెడలఁ బిల్లలకుఁ బదునారు నత్సరములు వచ్చినతరువాతఁ దల్లిదండ్రులు జీవించకూడదని శాసనము గావింతురు. కృతఘ్నులు నవినయపరులునగు సంతానమునకు దలిదండ్రులగుటకంటె వేఱె నరకముండఁబోదు. ఏలనో తలిదండ్రులకుఁ గన్నబిడ్డలపై నున్న కూర్మి బిడ్డలకుఁ దల్లిదండ్రులపై నుండదు. నేనునీకు సంబంధమరయునప్పుడు నీ వెక్కుడఁ గష్టపడుదువని యని యున్నరాజన్యులలో మిన్నయగు వానిం దెచ్చితిఁగాని తండ్రినగు నామనము నొవ్వకుండఁ దెచ్చిన సంబంధము చటుక్కున నొప్పికొని సంయుక్త పితృవాక్యమును బాలించెనను కీర్తికిఁ బాత్రురాలవు కాఁజాలవైతివి. మరి రామాయణము చదివితివే!

సం:—తండ్రి! నీవు వృధా యాగ్రహింపకుము. మనసు నున్నమాట మరుగుపెట్టక చెప్పుట మంచిదిగదా యని చెప్పితిని. స్త్రీపురుషులను సుమములనుమాలగాఁ గూర్చునపుడు ప్రేమసూత్రము తప్పక కావలెను. పిల్లలకు దలిదండ్రులయెడఁ బ్రేమ యుండదని చెప్పి నా నాళముల యందుఁ బ్రవహించు మిక్కిలి పవిత్రమైన రహతూరువంశ రక్తము నుడికించితివి. నేనేమో చదువుకున్నందువలన నవినయబుద్ధినైతినంటివి! మీరు వారినివారిని నేలఁ బ్రతి

మాలవలెను. నన్నీక్షణము మీమంత్రులలో నొకమంత్రిగాఁ జేసి దిగ్విజయమునకుఁ బంపుఁడు. భరతఖండము సర్వమును జయించి యిచ్చెద. రాజసూయార్థ మమిత ద్రవ్యముదెచ్చి యొసంగెద. అశ్వమేధమును దలపెట్టి యశ్వము వెంట న న్నంపుడు. దానిని సురక్షితముగాఁ దెచ్చి యొసంగెద. మీకు సార్వభౌమత్వమువచ్చునట్లు చేసెదను. ఎల్లైన నందు కొరకుగదా న న్నమ్ముకొనఁ జూచుట! మీకుఁ బుత్రులు లేనికొఱంతఁ దీర్చి నేనే పుత్రుఁడనై మిమ్ముల సార్వ భౌమునిఁ జేసెద. అప్పుడు నా చదువునకు ఫలము తెలియఁ గలదు. ఈ పెండ్లి మాత్రము మానుడి. నన్ను నేను ప్రేమింపనివానికిచ్చి యన్యాయముగా నాభావిజీవితము నేల భగ్నము గావించెదరు ?

జయ:—నీ యుపన్యాసము ముగిసినదా? ఇంక నీవు సార్వభౌమత్వము సంపాదించుచుండుట యొకటి కొఱంత వడినది. నోరు మూసికొని రేపు స్వయంవరమున నసితుని మెడలోఁ బూలదండ వైవుము.

సం:—మీరు కేవలము—

జయ:—నాకిఁక మారుపల్కవలదు. నే నిదివరకే ని న్నాతని కిచ్చి పెండ్లి చేసెదనని యాతనికి వాగ్దాన మొన

రించియున్నాను. నామాట గీటుపుచ్చుక రేపు వానినే వరింపుము.

సం:—మీరు—

జయ:—మారుపల్కవద్దని ఎన్నిసారులు చెప్పవలయును? నిన్నసితునికిచ్చి పెండ్లి చేసెదనని వాగ్దానమొనరించియుంటినని చెప్పలేదా? నీ వాతనినే వరింపవలయును. ఇంత స్వేచ్ఛయా? ఇంతయాగడమా? నేను తండ్రిననియు లేదు రాజుననియు లేదు భయము. ఆడువారలకు విద్యయొసంగినను స్వేచ్ఛయొసంగినను వారవి దుర్వినియోగము చేసెదరు. కావుననే "నస్త్రీస్వాతంత్ర్యమర్హతి" అని వేదము ఘోషించుచున్నది. రేపు నీ వసితుని వరించితీరవలయును. ఇఁక వేఱుమార్గములేదు. లేనియెడలఁ జాల ప్రమాదము. తెలిసినదా? వానినే వరింపుము. (నిష్క్రమించును.)

సం:—ఆగ్రహమున కవివేకమేఫలము.

మం:—(ప్రవేశించి) దేవీ! ఏమిది! రాజగారితో గట్టిగా వాదించుచున్నావు?

సం:—నీకు నిద్రాభంగమయ్యెనా?

మం:—కాదు! ఆవిషయమేది? అంత తీవ్రముగా వాదించుచున్నావని యడిగితిని.

సం:—ఆఁ! ఏమియు లేదు! స్వయంవర విషయము.

మం:—ఆతఁడేమనియెను?

సం:—ఘూర్జర నేతను వరింపుమనినాడు.

మం:—నీ వేమేని బదులు చెప్పితివా?

సం:—ఆతని వరింపఁ జాలనంటిని.

మం:—కారణముకూడ యడిగినా యతఁడు?

సం:—అతఁడడుగనూ అడిగినాడు, నేను చెప్పనూ చెప్పితిని.

మం:—ఏమని?

సం:—అతనిఁ బ్రేమించుట లేదని.

మం:—అప్పుడత డేమనియెను?

సం:—ఆగ్రహావిష్టుఁడై యసితుని వరింపక తప్పదని వెడలిపోయెను.

మం:—అంతేనా! పృథ్వీరాజును వలచితిని. అతనిఁ దప్ప నన్యులవరింపనని కూడ చెప్పితివా?

సం:—ఆతఁడింకను దగ్గి౦పలేదు కాని యదికూడ చెప్పనుంటిని. కాని అది చెప్పువర కాతఁడాగ లేదు. వెడలిపోయెను.

మం:—సఖి! నీవసితుని వరింపనని తెల్పవద్దని చెప్పి యుండ లేదానీకు?

సం:— అసితునిఁ బెండ్లియాడు మసితుని బెండ్లియాడు మని యాతఁడు చెప్పుచుండ నాతనిఁ బెండ్లియాడ నుద్దేశము లేనప్పు డట్లే పెండ్లియాడెదనని యబద్ధము చెప్పుటెట్లు?

మం:—అందుకనియే నీకు నేఁజెప్ప లేదు. నీకుఁగార్య స్యానుకూల్యము తెలియదు. వారు పృథ్వీరాజు నాహ్వానించి యుండ లేదు యాగమునకు స్వయంవరమునకుఁ గూడ.

సం:—నిజమేనా? అయ్యో! ఎంతటి దుర్దశ? మం జరీ! నిజముగనీకు నామీఁదఁ బ్రేమగలదా?

మం:—పరీక్షించెదవా నన్ను?

సం:—అట్లైన నాకుఁ గొంచెము విషముఁదెచ్చి పెట్టవే!

మం:—ఎందులకు?

సం:—దానినిఁగ్రోలి దుఃఖభాజనమైన యీశరీర మును విడచెదను. ఎందులకే యింక బ్రతికియుండి.

ఉ. చోహాణవంశరత్నమును సొంపెసలారెడు వక్షసీమను
త్సాహముతోడఁ జేర్చి సుఖసాగరమందుననోలలాడఁగా

నూహామొనర్చునాతలఁపు లూరకవమ్మయిపోవనిం
కసీ వైహికజీవనంబుకడు వ్యర్థముదుర్భరముగా గదా చెలీ.

మం:—చెలి ! నీవు ధీరవనుకొంటినిగాని ఇంత వేల వనుసంగతి తెలియనైతిని.

సం:—అదికాదే ! నేను పృథ్వీరాజుఁ దప్ప నన్యుల వరించుట కిష్టపడను. నాతండ్రి నేనసితునిదక్క నన్యుల వరించుట కియ్యకొనడు. ఇదివరకు పృథ్వీరాజు స్వయంవర మునకు వచ్చునుగదా ! అప్పుడాతని నే వరింపవచ్చునని యూరకుంటిని. నీవాయాశయు నిరాశగావించితివి. పృథ్వీ చెట్టపట్టుటకు నోమనైతిని.

ఉ. ఎవ్వని స్మానమంబునవ్యాశయిూశుడటంచును
నమ్మియుండునా
మవ్వపుమేనివానిని జమానసముబ్బఁగఁ జెట్టవట్టునో
పువ్వునుదావి వ్రాలెఁ బరిపూర్ణమనోరథసిద్ధికల్గనా
జవ్వని యేమినోముతొలిజన్మమునందున నోచియుండునో.

మం:—చెలీ ! ఊరక ధైర్యము గోలుపోయిన లాభ ము లేదు. కష్టసమయములందు ధైర్యముఁ గోలుపోకుండు టయే ఘనతకు లక్షణము.

సం:—యశఃకామ ముండుటకు నేను బురుషుడను కాను. నాకు నామనోనాయకుఁడగు పృథ్వీని వరించుట దక్క మరేమియుఁ గోరిక లేదు.

మం:—అట్టి కోర్కె విషము త్రాగి యెట్లు తీర్చుకొందువు ?

సం:—దుఃఖభారముచే నట్లంటిని కాని నేనేమి తెలివిమాలిన దాననా ?

మం:—తెలివిమాలిన దానవు కావు. పిరికిదానవు.

సం:—ఎట్లు ?

మం:—అసితుని నిరాకరించి పృథ్వీరాజును వరించుటవలన వచ్చు కష్టముల నోర్చుకొనుటకు నీకు ధైర్యము లేదు. కావుననే విషమును గ్రోల నెంచితివి.

సం:—మంజరీ అట్లు తలంపకుము. నేను నిండుసభలో నసితుఁడును జనకుఁడును జూచుచుండఁ బూలదండఁ బృథ్వీరాజు కంఠమున వైచెదను. ఒకవేళ నామహానుభావుఁడు స్వయంవరమునకు రానియెడల నాహారమును హస్తమునఁ గీలించి స్వయంవర మంటపమున నట్లే పాంచాలిపోలి కనిలఁ బడెదను. అంతియే కాని అసితునిమాత్రము వరింపను.

నాతండ్రి నన్నుఁ దిట్టినఁ దిట్టనిమ్ము. కొట్టినఁ గొట్టనిమ్ము. బంధించినఁ బంధింపనిమ్ము. చివరకుఁ జిత్రవధనైనఁ గావింప నిమ్ము. అంతకంటె నెక్కువ వేమియుఁ జేయఁజాలడుగదా! సంయుక్త ప్రేమకొఱకు తండ్రియాగ్రహమును బ్రతిఘటించి యసువులఁ గోలుపోయెనని జనులు చెప్పుకొందురుగాక! సంయుక్తా స్వయంవరమని కవులు విషాదాంతనాటకములు వ్రాయుదురు గాక! ముమ్ముందు వివాహస్వేచ్ఛ గావలెనని యుపన్యాసము లిచ్చు సంఘసంస్కర్తలు నన్నుదాహరణముగాఁ గైకొందురు గాక! మంజరీ!

మం:—చెలీ! చాలు నీసంభాషణము. అమంగళము ప్రతిహతమగుఁగాక! ఇంతయుద్రేకములున్నఁ గార్యము లెట్లుసానుకూలములు కాఁగలవు?

సం:—అదిగాదే! చూడు నాజనకుఁడునన్ను మలమలమాడ్చినా నాయెమ్ములపైనఁ దాను తనసౌఖ్యసౌధమును నిర్మింపఁ జూచుచున్నాఁడు. తనయలయెడ నింత నిర్దాక్షిణ్యముగల జనకులుందురా? నాతల్లి లేకపోవుటచేనాకు—

(ఏడ్చుచును.)

మం:—చెలీ! చాలు. నీకంతకంతకు మతిపోవుచున్నది. నిన్నుఁ బృథ్వీకిఁ గూర్చుభారమునాది. నీవిఁక నిశ్చింతగ నిద్రపొమ్ము.

సం:—నామూలమున నీకుఁగూడ కష్టములు సంభవించుచున్నవి. నాకొఱకు నాతండ్రిని విడిపింపనేగి గాయపడితివి. ఇప్పుడు—

మం:—స్వయంవరానంతరము పృథ్వీమహారాజుతో జెప్పి నాకష్టములకుఁ దగిన బహుమతి నిప్పింతువుగాని లే. ఇప్పుడు పండుకొనుము.

సం.—మీకుఁగష్టములు సంభవించునెడల మా రాష్ట్రమునకు రావచ్చునని యాపురుషసింహుఁడు వక్కాణించిన రీతి ఎన్నటికి మరపునకురాదు. అతఁడెంత యందగాడో అంత బలవంతుఁడు. ఎంత బలవంతుఁడో అంత విద్వాంసుఁడు. ఎంతపరాక్రమమో అంతసౌమ్యత. అంత వినయము. నిజముగ నాతఁడు లోకోత్తరుఁడు. సర్వసద్గుణములు నొకచో నిమిడియున్నవి. పురుషసింహము.

మం:—ఇంక నీవు నిద్రపోవుగదా!

సం:—నన్నాతఁడు ప్రేమించునో లేదో కదా! నా నామాక్షరములుగల ఖడ్గమును గాంచి ఏమనుకొనునో? నన్నుఁబ్రేమించుచుండినను, నేను తన్నుఁబ్రేమించుచున్న సంగతి తెలియక యౌదాసీన్యమువహించునేమో?

మం:—(స్వగతము) నేను మాటాడునెడల నీమె ఇల్లేయేదోయొకటి యనుచుండును. ఇప్పుడికప్పుడే రాత్రి ఇరువదిగడియలైనది. నేనింకఁబోయి పండుకొనెదను. (ప్రకాశముగా) నాకు నిద్రవచ్చుచున్నది. నేను పోయెదను. నీవింక నిద్రింపుము. (నిష్క్రమించును.)

(తెర.)

## తృతీయరంగము

(జయచంద్రుని దర్బారు)

(ప్రవేశము)

(జయచంద్రుఁడు, జయంతుఁడు, కవులు, సామంతులు)

జయచం:—మంత్రివర్యా నేఁ జెప్పినట్లన్నియుఁ జరిపించితిరా ?

జయంత:—చిత్తము. రాజులెల్లరకు నాహ్వానపత్రిక లంపఁబడినవి. ఢిల్లీకి మాత్ర మాహ్వానపత్రిక యంపఁబడలేదు. సమరసింహమహారాజునకు మిక్కిలి విలువగల కానుకలంపఁబడినవి.

జయచం:—సరే! బాగుగనే యున్నది. ఇచ్చటకువచ్చు జన్యులకు విడియుటకుఁ దగిన స్థలముల నేర్పరుపఁబంపుడు.

జయంత:—చి త్తము.

సేవకు:—(ప్రవేశించి) జయము జయము మహా రాజా! ద్వారమునొద్ద నెవరో పండితులు వేచియున్నారు.

జయచం:—సత్వరము ప్రవేశపెట్టుము.

(సేవకుఁడు నిష్క్రమించును.)

కవిచం:—(కాశీపండితుని వేషమునఁ బ్రవేశించి)

శ్లో. స్వస్తిశ్రీజయచంద్రనామనృపతే దిక్పాలకలోజ్జ్వల
స్వస్త్యస్తుప్రతివీరనిర్మథనతే షట్చాస్త్రపారంగత
స్వస్త్యస్తుక్షితినాథదేవపతితే విద్యత్సరోజార్కతే
స్వస్త్యస్తుత్రిపురాంతకాంచితబల ప్రజ్ఞాఢ్యచాణక్యతే.

మ. పొడుపుంగుబ్బలిచేరి నీయశము సంపూర్ణంబుగాఁ జూచి కి
న్కడరఁగా దాఁకి జయింపలేక తుదిధైర్యంబెల్లఁబోనాడి లో
జడుపుంబొంది వివర్ణుఁడయ్యెనపురా చంద్రుండు
లేకున్న ముక్క
గడురాగంబునఁబొల్చియంత సితుఁడై ప్రకాలంగనే
హేతువ్రా.

తే. గీ. సతతసత్సంగకలితుఁడై సత్ప్రథానఁ
గ్రాలుచెప్పఁదమోవి నిగ్రహుఁడునగుచు
వైరిచక్రంబులను మాపి వఱలురాజు
కువలయానందసంధాయకుండు కాఁడె.

జయచం:—ఆర్యా! ఆయాసన మలంకరింపుడు. మీరాకచే మిక్కిలి కృతార్థుఁడనైతిని. ఏ దేశము మీయావాసముచే వాసిఁగనెను?

కవిచం:—

క. వాసింగాంచిన కాశిక
వాసంబనిశంబునాకు, వారకవిద్యా
వ్యాసంగము నచ్చటనే
భాసురకీర్తిప్రతాప భంజితభూపా.

జయచం:—పవిత్రములగు తమ నామాక్షరములు వినఁ గుతూహల పడుచున్నాను.

కవిచం:—

ఆ. వె. పిన్ననాటనాకు విద్యాపతియటంచుఁ
బేరుపెట్టెఁదండ్రి ప్రీతితోడఁ
గమ్రకవితఁజెప్పి కవిచంద్రుఁడనుపేరు
గాంచినాఁడఁ గాశికాపురాన.

జయచం:—తమ్ము నిటకుఁ దెచ్చిన కార్యమునడుగ వచ్చునా ?

కవిచం:—

మ. అటు వారాణసి సేతువీదరిని మధ్యంగల్గురాజ్యంబు లు
త్కటమాతంగతురంగసద్భట రథోద్యద్రాజధామంబులేఁ
బటుదాటిఁ జని కాంచుచుంటి దశదిక్ప్రఖ్యాతకీర్తిప్రద త
త్కటకస్థారుకవీంద్రచారుకవితాధారాసుధఁ గ్రోలఁగన్.

జయచం:—మహాభాగ్యము. ఈమధ్య రాజకీయపుఁ దొందరలచే సారస్వతప్రసక్తియే లేక త్రుప్పుపట్టియున్న మా వీనులకు మీవాగామృతము ప్రసాదించి విందొనర్చితిరి. వీరే మా యాస్థానకవులు. వీరలతో మీరు యథేచ్ఛముగా వాదము చేయవచ్చును. కవులారా! ఈకవివతంసునిప్రశ్నలకు సదుత్తరముల నిత్తురని తలంతును.

వికలుఁడు:—

క. ఆలాగే చెప్పెదమిట
చాలన్ సరసంపు భావసంపత్తులతో
నేలినవానిందనిపెద
మేలా మీరింతఁ జెప్పఁ నింతటిపనికే.

కవిచం:—కవీంద్రులారా! మీ విమలమధురా
సుధారచే నీసమస్యను బూరింపుడు.

సగుణోపాసనచేయుచుంటిఁగదా నీసాయుజ్యముఁ
జెందఁగన్.

సుకలుఁడు:—(ఆలోచించి)

మ. అగజాదేవిని వామభాగమున నయ్యాకాశగంగోరు ని
మ్నగమూర్ధమ్మునసంకపీఠమున విఘ్నాధీశు నేనుంగుతో
లుఁగటిన్ నిల్పిన ఇందుశేఖర భవద్రూపంబు
ధ్యానించుచున్
సగుణోపాసనచేయుచుంటిఁగద నీసాయుజ్యముఁ
జెందఁగన్.

వికలుఁడు:—(కొంచె మాలోచించి)

మ. పగవాఁడై జనకుండు నాకనిశమున్ బాధన్ ఘటింపంగనీ
తగదీబుద్ధియటంచు బంధుగులునన్ దారెంతనిందింపనీ
విగతార్తి విగానసీపదము లేవేళన్ దగన్ నమ్ముచున్
సగుణోపాసనచేయుచుంటిఁగద నీసాయుజ్యముఁ
జెందఁగన్.

అని ప్రహ్లాదుఁడు తన మనోనిశ్చయమును దెలియఁ
బలికినాడు.

కవిచం:—(తనలో) వీరందర కవిత్వ మెవరికిఁ గావలయును. సంయుక్తాదేవిచే నీసమస్య పూరింపఁబడిన చో నేవచ్చిన కార్యము సఫలమగును. (ప్రకాశముగా) తమయా స్థానమునఁ గవిత్వము సెప్ప నేర్చిన వారలింక లేరా ?

జయచం:—కవులంద ఱిచ్చటనే యున్నారు. ఇంత కన్నఁ గవిత్వము చెప్పఁగలవార లెవరున్నారు. ఆఁ! ఉం డుఁడి! నాతనయ కొంచెము పద్యము లల్లఁగలదు. ఆమెను బిలుపించెద. ఓరీ! ఎవఁడురా యక్కడ ?

సేవకుఁడు:—(ప్రవేశించి) చిత్తము మహాప్రభో!

జయచం:—నీవుపోయి మంజరితో సంయుక్తనిటకుఁ దోడ్తెమ్మని చెప్పుము. పొమ్ము.

(సేవకుఁడు నిష్క్రమించును.)

కవి:—జయచంద్ర మహారాజా! రాజులందరిలో నీవొక్కఁడవే ధన్యుఁడవు! ఏలయన విద్యావతియగు సుతకుఁచితవగుట, లోకమున నెందఱో తనయులుగలవారు కలరు కాని విద్యావతులగు తనయులు గలవారలరుదు.

సేవ:—(ప్రవేశించి) దేవా! వారిదేవచ్చియున్నారు.

జయచం:—తెరనొకదానిని నడ్డముగాఁ గట్టుము. (సేవకుఁ డట్లు చేయుచున్నాడు.) (తెరమరుగున సంయుక్తా మంజరుల ప్రవేశము.)

జయచం:—అమ్మా! మన యాస్థానమున నొక మహాకవి నేడరుదెంచినాడు. ఆతఁడొక సమస్యనిచ్చి పూరింపుడని కోరుచున్నాడు. నీవేమైనఁ బ్రయత్నింతువా?

సం:—మంజరీ! కవిసింహునొద్దనుండి ఆసమస్య నిటు తేవేచూతము.

మం:—ముందునకు వచ్చి కవిచంద్రునొద్దనుండి కమ్మ గ్రహించి తెచ్చి సంయుక్తకిచ్చును.

సం:—సగుణోపాసన చేయుచుంటేఁగద నీసాయు జ్యముఁ జెందఁగ (అని చదివి యాలోచించి వ్రాయు చుండును.)

కవిచం:—రాజచంద్రా!

క. కవితాయువతీ శోభకు
నవసరమ బృథ్వీరాజ హస్తస రోజా
తవరావలంబన శ్రీ
కవిజనసంస్తుత్యవర్తి ఘనతరకీర్తి.

సం:—మంజరీ ! దీనిని కవిసింహులకొసంగిరావే !

మం:—పండిత శిరోమణీ ! మారాజుమూర్తి తమ సమస్యను బూరించెను. తిలకింపుడు. (పత్రమునిచ్చి సంయుక్త కడకేతెంచును.)

కవిచం:—(పద్యమును దనలోఁ జదువుకొనుచుం డును.)

సం:—ఇప్పుడాకవిచంద్రుడు చెప్పిన పద్యము నీవు వింటివా ?

మం:—నేను బాగుగావినలేదు. కవితాలతకు రాజాశ్రియముకావలయుననియో యేదో చెప్పినాడు.

సం:—ఆఁ ! అది ద్వ్యర్థి.

మం:— అందలి రెండర్థములు నేమి ?

సం:—కవితాయువతీశోభకుఁ బృథ్వీశ అనఁగా భూమియందు రాజకరావలంబనము కావలయును. ఇది యొకటి కవితాయువతీశోభకు అనఁగా కవితాశోభకు యువతీశోభకు లేక కవితనేర్చిన యువతిశోభకుఁ బృథ్వీరాజు కరావలంబనము కావలయును. ఇది రెండవది.

మం:—ఈతని వ్యంగ్యధోరణిచూడఁగా నీతఁడు పృథ్వీశధూతయేమోనని నాకనుమానమగుచున్నది.

కవిచం:—(ప్రకాశముగా)

మ. మృగరాణ్మధ్యముఁ గేరుమధ్యము మహామీనధ్వజా స్థానముఁ
నగజాల్వ్యక్షము హేమదీప్తిసరిమెన్నంజాలు దేహద్యుతుల్
జగడానన్నశి గెల్చుమోముగల నీసన్మూర్తిలక్ష్యంబుగా
సగుణోపాసనచేయుచుంటిఁ గదనీసాయుజ్యముఁ జెందఁగఁ.

చక్కగానున్నది. మిక్కిలి చక్కగానున్నది. ఏవిద్యయం దైనను స్త్రీలను బురుషులను సమానముగాఁ ప్రవేశపెట్టినఁ బురుషులకన్న స్త్రీలేయెక్కువచక్కగా రాణింతురు. మంజరీ ఇదిగో! నేను నానారాజసందర్శనముచేయుచు వచ్చినపు డచ్చటచ్చట నాయాకవులీసమస్యను బూరించుచు రచించిన పద్యములు మారాజపుత్రికకు వీనింజూడ నభిలాషయుండ వచ్చును. వీనింగైకొని యామెకిమ్ము. రాజేంద్రా! నీవు కూడఁగొన్నిటిఁ జూడుము. కవులారా! పరిశీలింపుడు. (కొన్ని కమ్మలను గవులకిచ్చును. కొన్నిటిరాజునకు మరికొన్నిటి మంజరి కిచ్చును.)

మం:—మహాప్రసాదము. (కమ్మలు తీసికొని సంయుక్తకడ కేతెంచును)

కవిచం:—(తనలో) నేను వచ్చినపని యిచ్చటనే పూర్తియైనది. సంయుక్తా దేవిహృదయమీపద్యమునఁ గాన వచ్చుచున్నది. తెలియునట్లుగను దెలియకుండునట్లుగను నామె తనమనోభావమును దెలిపినది. పృథ్వీరాజేంద్రుని మనోభిప్రాయమును దెలుపు నాతనిపద్యమునుగూడ నామె కడకుఁ జేర్చితిని. ఇదియేమిచెపుమా! మారాజేంద్రుని పద్యమునకు నీమె పద్యమునకు సాదృశ్యమున్నది. వీరిరువురి యాలోచనలు నొక్కటియే యగుటచే నవి వాగూ్రపము ధరించినప్పుడుకూడ నొకరీతిగానే యున్నవి. కాని యీమె మారాజేంద్రునే వరించియున్నట్లు తెలిసికొనుటయెట్లు? సరే! యీమె మగవేసముధరించి యుద్ధమునకుఁబోయి మారాజేంద్రునకుఁ గత్తినిచ్చియున్నదో లేదో తెలిసికొనుటకై యొకటిరెండు సమస్యలనిచ్చి చూచెదను. (సంయుక్తా మంజరులు పత్రములు చూచుచుందురు.)

మం:—చెలీ! చూడు మీపద్యమెంతరమణీయముగానున్నదో?

సం:—ఏమీ చదువుము.

మం:—నీవే చదువుము.

సం:—(పత్రికఁ బుచ్చుకొని)

మ. మగమీలన్నగు సోగకన్నుఁగవయున్మారాస్త్రసందోహము
న్నగచేమారొక్కనుచూడ్కులబ్దములఁ జిహ్వంగేరునీలాలక
ల్జిగుకుంగాదను కేలుదోయి కలనీచిన్మాత్రిలక్ష్యంబుగా
సగుణోపాసన చేయుచుంటిఁగఁదనీసాయుజ్యమున్జెందఁగన్

ఇది ఎవరు వ్రాసినది?

మం:—దానిక్రింద నే యున్నది పేరు. చదువుము.

సం:—పృథ్వీరాజు. ఆమహారాజు నింతవలపించిన

మం:—మొత్తముమీఁద పృథ్వీరాజు స్త్రీ విద్యోపాసకుఁడు. ఆపద్యమునందుఁ జిత్రింపఁబడిన స్త్రీ దైవతము ఖడ్గమును బహూకరించిన కలవాణికాక యింకెవ్వరై యుండ గలరు? ఇదియంతయు నాఖడ్గమహిమయే?

సం:—ఏమో నాకంతటి యదృష్టమా?

మం:—నీకు నమ్మకముచాలనిచో నేనాబ్రాహ్మణునిఁ గలసికొనియుదంతమునంతయు నరసివచ్చెదను.

కవిచం:—రాజేంద్రా! నేనుపోయివచ్చెదను. నే నింకను జాలరాజ్యములఁ దిలకింపవలసియున్నది.

జయచం:—కవీంద్రా! మీరింకను మావిటఁ గొంత కాలముండి నారాజసూయమును నాకన్యాస్వయంవరమును దిలకించిపొండు.

కవిచం:—చిత్తము. పోకతీరదు. క్షమింపవలెను.

జయచం:—కవీంద్రుల యనుగ్రహము. ఓరీ! ఎవఁడురా యక్కడ. తాంబూల కరండముఁ గొనిరమ్ము.

కవిచం:—మంజరీ! కవితాచాపల్యముగల నేనింకను మీరాజకుమారి వాగమృతమునఁ దనియలేదు. శ్రమయని తలంపనిచో నామెనోట నింక నొకటిరెండు పద్యముల విన నివారిత కౌతూహలినై యున్నాను.

సం:—(మంజరి చెవిలో మెల్లగ నేదియో చెప్పును.)

మం:—కవిసార్వభౌమా! అవశ్య మట్లుచేయవచ్చును.

కవిచం:—(కమ్మపై నేదియో వ్రాసి) ఈసమస్యలఁగూడఁ బూరింపుమనుము. (మంజరికిఁ గమ్మనిచ్చును.)

మం:—చిత్తము. (కమ్మను సంయుక్త కిచ్చును.)

సం:—(కమ్మనందుకొని నేదియో వ్రాసియిచ్చును.)

మం:—(కమ్మను దెచ్చి కవిచంద్రున కిచ్చును.)

కవిచం:—(కమ్మనందుకొని) రాజచంద్రమా! నే నిచ్చిన సమస్యలివి. 1. వాలమ్మను గాంతయిచ్చెఁ బరమప్రీతిన్, 2. పురుషునిగామించె నొక్కపురుషుండహహా॥ వానిని యువరాజ్ఞి యిట్లుపూరించె.

1. ఆలమ్మన దుర్మతులొక
బాలుంజంపంగనుండ వారలబారం
దోలినవీరునకును గర
వాలమ్మను గాంతయిచ్చెఁ బరమప్రీతిన్.

2. పురుషాకృతిఁ గైకొన్న స
తిరూపవిక్రములఁ గని తెలియనను చుఁ దా
నెఱిగిన పిమ్మటఁ గుహనా
పురుషునిఁ గామించె నొక్కపురుషుండహహా॥

రాజచంద్రమా! మీతనయ కవితా సామర్థ్యమనన్యసామాన్యము. ఈమె రచించిన పద్దెములు కర్ణపేయములుగా నున్నవి. నాకింక సెలవు దయచేయుఁడు.

జయచం:—(కర్పూరతాంబూలము వెట్టి సగౌరవముగా వీడ్కొల్పును.)

కవిచం:—(నిష్క్రమించును.)

జయచం:— ఈపూటకింకఁ గొలువుచాలింతము.

(తెరపడును.)

# చతుర్థరంగము.



(కన్యాకుబ్జమున నొకవీధి:--ప్రవేశము—కవిచంద్రుఁడు.)

కవిచం:—ఆహాహా! ఆరాజకుమారి ఎంతచక్కఁగాఁ దన మనోభావమును వెలిఁబుచ్చుచుఁ బద్యములఁ జెప్పెను? ఇంతకంటె నామెకుఁ బృథ్వీరాజుపై ననురాగము కలదని చెప్పుటకుఁ దార్కాణ మేమి కావలయును? పృథ్వీమహీపతి వ్రాసిన పద్యంబు నామె కిచ్చి కర్తవ్యంబు నెరవేర్చుకొంటిని.

మం:—(ప్రవేశించి) ఆర్యా! నమస్కారము.

కవిచం:—ఓహో సంయుక్తాసఖి మంజరియా? మంజరీ! నీమీఁదఁ గావ్యము జెప్పెద నే మిచ్చెదవు?

క. మంజరినూపురరవజిత
ఖంజరి పీనస్తనయుగ గమనవిజిత ది
క్కుంజరి సితరదనహసిత
మంజరి కచవిజితమత్తమధుకరిచూడన్.

మం:—కవివర్యా! నామీఁదఁ బద్దెము చెప్పినందులకుఁ దా మిచ్చుటకు వచ్చిన పని సానుకూలముగా నెరవేర్చి పెట్టెదను.

కవిచం:—నే నిచ్చటకు వచ్చిన పని యేమి ?

మం:—తాము వచ్చిన పని తమకే తెలియదా ? కవితాసుధరసపానమత్తు లయితిరి కాంబోలు !

కవిచం:—నేను వచ్చిన పని నీ కెట్లు తెలియు నని యడిగితిని.

మం:—లోకములో మీరు మీ పృథ్వీరాజు మీ రిద్దరే చాల తెలివిగలవా రని మీ రనుకొనుచుంటిరి కాంబోలు.

కవిచం:—(స్వ) గడుసుముండ కనిపెట్టినది. (ప్రకాశముగా) సరియే ! సంయుక్త, మంజరి వీ రిరువురును గూడ చాల తెలివిగలవా రనియేనా నీవు చెప్పునది ?

మం:—అవును.

కవిచం:—ఆ విషయము నేను సమస్యాపూరణ మప్పుడే కనిపెట్టితిని.

మం:—మీరాకకుఁ గారణము నాకుఁ దెలియక పో లేదు !

కవిచం:—అంతఃపురపరిచారికా జ్యోతిషశ్రవణైకో త్కంఠచేఁ గర్ణములు మిక్కిలి తహతహ పడుచున్నవి.

మం:—మీరు మా దేవి కవనమరయుటకురా లేదు.

కవిచం:—మరి ?

మం:—మన మరయుటకు వచ్చితి రని విన్నవించు చున్నాను.

కవిచం:—ఎట్లు ?

మం:—కవిత నెపమున.

కవిచం:—అట్లనా ! సరే ! ఆ విషయమున నీవు నాకుఁ జేయఁగల సాహాయ్య మేమి ?

మం:—మీరు శ్రమపడ నక్కఱలేకుండ నామె మనోభావమును మీకు విశదపరచుటయే.

కవిచం:—సరే ! అట్లు చేయుము.

మం:—అట్లు చేయుటకు ముందుఁ గొన్ని ప్రశ్నలకు సమాధాన మిండు.

కవిచం:—నీవ్యాపారము పిష్టపేషణమువలె నున్నదే?

మం:—మరిపిష్టములేనిదే అటు చేయుట ఎటు ?

కవిచం:—అబ్బా ! ఏమి చమత్కారము ? సరే ! ప్రశ్నల నడుగవచ్చును.

మం:—పృథ్వీరాజు నొద్దనుండికదా మీరాక !

కవిచం:—తరువాత ?

మం:—ముందు దీనికుత్తర మిండు.

కవిచం:—దీనికు త్తరము లేదు. సంయుక్త కొక యుత్తరముండెను. దాని నామె కిమ్మని నీచేతికే యిచ్చితి సభాంతరమున.

మం:—కవిచంద్రుని హస్తములు కావ్యముల మాని కమ్మల మోయుట తటస్థించినది కాఁబోలు!

కవి:—మరలఁ గమ్మలను మాటలోఁగూడ ద్వ్యర్థి యేనా? మంజరి! మగవార లెప్పుడు నాడువారలకు లోకు వయే! నీవు చెప్పఁదలచినది శీఘ్రముగా స్పష్టముగాఁ జెప్పుము. నేను పృథ్వీరాజు నొద్దకేగవలయును.

మం:—మరి ఆలాగు దారికిరండు. సంయుక్తా దేవి విషయమున మీరుపడిన యభిప్రాయము సరియైనది. ఆమె పృథ్వీరాజును గాఢముగా వలచియున్నది. భూపాలుఁడామె నసితసింహున కిచ్చెదనని వాగ్దాన మొనరించియున్నాడు. ఆమె పృథ్వీరాజును దక్క నన్యుల వరించనని భీష్మించుకొని కూర్చున్నది. కాని యాతఁడు దన్నుఁ బ్రేమించుచున్నాడో లేదో తెలియక పోవుటచేత మిక్కిలి తహతహ పడుచున్నది. పద్యమూలకముగా నాతని మనము నూహించుటకుఁ గొంతవరకు వీలున్నను నామెకు నమ్మకము చాలుట లేదు.

కవిచం:—సరియే! నేను వచ్చిన పనికూడ నదియే కావున నామె కిట్లని చెప్పుము. సభలో సమస్య నిచ్చినకవి చంద్రుఁడు పృథ్వీరాజాస్థాన కవిచంద్రుఁడగు కవిచంద్రుఁడు కాని కాశికాపుర కవిచంద్రుఁడు కాఁడు. పృథ్వీరాజు సంయుక్తా ఖడ్గమును దిలకించినది మొదలు మన్మథు నాతనిపరివారముఁ దిట్లని గడియలేదు. ఆతనిబాహ్యాం తరప్రపంచములలో నాతనికి సంయుక్త తప్ప వేఱు కానవచ్చుటలేదు. ఆతనికద్వైతము బాగుగా సిద్ధించినది. ఇప్పుడాతనికి నేను సంయుక్తా హృదయమును మోసికొనిపోయి యిచ్చెదను. ఆతని మనము నీవలనకే సంయుక్త హరించియుండెఁ గాన నామెను ధైర్యమున నుండుమని చెప్పుము. ఇంకనీవుపొమ్ము.

మం:—ఎట్లయిన సంయుక్తా పృథ్వీరాజుల దంపతులగాఁ జేయుభారము తమది.

కవిచం:—ఆభారమున నర్ధము నీవుకూడ భరింపవలెను.

మం:—నేనబలను. దౌత్యదురంధరులగు నగ్నిద్యోతనులవారే యందులకరులు.

కవిచం:—అగ్నిద్యోతనుఁడాయనువారలే కానియమే యధనావళురిచ్చువారుమాత్రము కానరారు.

మం:—మీసందేశము నాలకించిన నొక్కరొక్కముసేకాదు మీ ధరాకాంతుఁడు సర్వరాజ్యము నీయఁ

గలదు. వేగమాతనికడకుఁబొండు. సెలవు. (నమస్కరించి నిష్క్రమించును.)

కవిచం:— ఇప్పటికి నావచ్చినకార్యము సఫలమైనది. సంయుక్త తన్నుఁ బ్రేమించుచున్నదని తెలిసికొని పృథ్వీరాజెంతయానందింపఁగలఁడో కదా ! పాపమాతఁడాలస్యమున గోరువఁజాలఁడు. నేను శీఘ్రముగా ఢిల్లీకిఁబోయి సంయుక్తా సందేశమును రత్నముకల యీపద్యపేటికయు దీనినిఁ దెలుచు టకై మంజరి నాకొసంగిపోయిన తాళముచెవియు నాతని కిచ్చెద. తరువాత నాతఁడు తనప్రియత్నమున దానుండును. ఈపాటికప్పుడే జగన్మదనుఁడగు మన్మథుఁడు సపరివారముగ నాతనిపై దండువిడిసి అసహాయుఁడగు నాతనిఁ ద్రాటంగట్టిన పురుగునుంబోలె నాడించుచుండును. ఆతఁడుక ఌటఁబడఁగానే

శ్రా. నిన్నుంజంతయునర్చుచుం నిరతముం నీమీఁదపద్దెంబులం
సన్నాహంబొనరించుచుం జదువుచుం సంతోషముం జెందుచుం
నిన్నే చిత్రములందునెప్పుడును దానేర్పొప్పఁజిత్రించుచుం
నిన్నేనమ్మికయున్నదామదవతిం నీవెట్లురక్షించెదో.

అని శ్రీరాగమున నెలుఁగెత్తిచదివి యాతనిఁ బులకాంచితుఁ గావించెదఁగాక. (నిష్క్రమించును.)




# చతుర్థాంకము.

## ప్రథమరంగము.

—∘∘⁂∘∘—

ప్రదేశము:— ఢిల్లీకిని కనోజికినిమధ్య నొకయరణ్య మార్గము.

ప్రవేశము:— ఖాసిం కరీం అను నిద్దఱు మ్లేచ్ఛ చారులు త్రాగి తూలుచు పాడుచుఁ బ్రవేశింతురు.

పాట.

పల్లవి. కల్లుతాగినా ఒళుతూలినా. కైసాహోతాహై.

(1) అరె కడుపునిండుగాఖానా

జోర్ చెవులనిండుగాగానా

ఒకపక్కను అవర్ ప్యారీ
అవతలదారూజారీ

ఐసాహైతో వేనంగ్రైతో క్యాబీసింతానై ॥కల్లు॥

(2) అరరే దేఖో భాయీ
ఏదారు బలేహోయీ
ఇది ఖుషీరాజ్ సిపాయీ
మనపున్నెంకొద్దిఆయీ

అందుచేతనే యరమర లేకయుపొట్టనిండుగాపోయీ॥కలు॥

(3) ఇది పీకో కవిత్వాబోల్తుం
ఇది దేఖోనాటక్ ఖేల్తుం
దీనిసరినై పందెం డాల్తుం
ఇది లేందేనర్కం చల్తుం

ఇంతగొప్ప దీధరలోజూడగ ఏగతిదీనిని విడ్తుక॥కల్లు॥

4. అరెచెట్లకాడనూహాళీ
ఖర్ ఖుండల్ ఖుండల్ ఖాళీ
ఇదిహైతోబలసింగేళీ
ఇదినైతో మన్కంగాళీ

అందరుదీనిని త్రాగుటమరగినమనలోంటోళ్ళకుగోరీ ॥కం॥

5. కల్లుకుండకీ జై
ఇది అల్లాకంటె పై
ఇది హైతో సోబ్బీపై
ఇదినె తో క్యాబీనె.

అరె తాటీసెట్లు సల్లగఉంటే, కాటక మొస్తె నేం॥ అరె కల్లుతాగినా॥

ఖాసిం:—కరీంభాయ్! ఇదిఎంత దేసంరే! మన దేశంలో యీత సెట్లేకాని తాటిసెట్లూనైరే. ఈదేశం వచ్చినాక తాటీకల్లు మజా మనకీ తెల్సిందిరే, అరే! తాటి కల్లామజా! ఈతకల్లూమజా? తుంబోల్ మైందేఖుం.

కరీం:—అరే! అల్లా! కైసా పెస్నపూచారే! యే దేసం మే బడాబడా పండితులు బితీరాదరమ్మ సందేహం తీర్చలేరుబే. కెత్తాపడేతో క్యారే! అను బోగంన్నైతో ఐసా యిస మనమస్సల్ కినై మాలుంహోతా! మాలుంక్యా! మగర్ మైబోల్తుందేఖో! నైరో! కైరో! పై వేయె పెస్నకి జవాబ్ దేవ్! ఈత సెట్టూ బడా? తాటిసెట్టూ బడా? వాఁదేఖ్! ఏక్ ఈతసెట్టూహైఏక్ తాటిసెట్టూహై. దెఖో బోల్.

ఖాసిం:—కిదర్ బే! ఉదర్ యీతసెట్టూ నైహై తాటిసెట్టూ నైహై.

కరీం:—(ఖాసింతలపైఁ గొట్టి) ఈతసెట్టు ఇదర్ హై. (తన తలపైఁ గొట్టుకొని) తాటిసెట్టూ ఇదర్ హై.

ఖాసిం:—అరే నీ బోడిగుండు కల్లు కుండగాను! కత్నా అచ్ఛా బోలారే! అరేభాయీ! అమారాజనాబ్ అబఫ్ఖాఁ కాహుకుంక్యా? అబ్ హామేకర్తేహైంసో కాంక్యా?

కరీం:—ఆఁ! క్యా కాంరే! కాఫర్‌కీ కోస్కూ యే జంగిల్కు ఆయాతో, హమారా ఆబోకీ మాలుం లేకర్ కాఫర్ రాజుల్కు బోలేతో బహుత్ తక్లీఫ్ హోతాకతో కాఫర్లకీ పకడ్ లేకర్ ఆవుకతో హమారాజనాబ్ అసఫ్ ఖాఁ హంకు హుకుం జారీకరే. క్యా మై దారూపీయాతో మతీగయాక్యా! యేబాత్ ఫిర్ బోలేతో దేఖో నీకీ తడాఖా తీస్తాఁ.

ఖాసిం:—నైరే! సర్కార్‌కా హుకుం జారీకర్ నకో క్యా?

కరీం:—అచ్ఛా! అచ్ఛా! దేఖో! (ఖాసింపైపు చూచి) అరే ఖాసిం! తు ఏక్ ఖాసిం క్యా! నైతో దో ఖాసిం!

ఖాసిం:—(అన్నివైపులను దిరిగి చూచుకొని) అరే! ఇదర్ ఏక్ ఖాసిం బి నైహైరే.

కరీం:—(నవ్వుచు) ఫిర్ తూంకో నేఁ !

ఖాసిం:—ఉదర్ దేఖ్ రే! మై ఉదర్ హై! ఇదర్ నై! ఆ తాటిసెట్టు ఎక్కి కల్లు తీస్తూ ఉండాను.

కరీం:—(చూచి) ఆఁ ! ఓ యీంత సెట్టూ రే! తాటీ సెట్టూ నై. హమీచ్ ఆయీంత సెట్టెక్కి కల్లుతీస్తూఉండాది. తూ నై. ఇదర్ దేఖ్ కల్లుకుండ. ఆచెట్టుమీందనుంచి ఎంతకల్లు తెచ్చానో దేఖో! (తాఁగును.)

ఖాసిం:—(తనచేతిలోనికుండ పారవైచి, కరీంచేతిలోని కుండ పట్టుకొని) ఇప్పుడు సెట్టెక్కి నేను కల్లుతీసుకొస్తే నువ్వు తాగేస్తావా ? తే. (లాగుకొనును. వారుపెనగులాడుటలోఁ కుండ క్రిందఁబడిఁ పగులును.)

కరీం:—అరే కల్లుఅంతా క్రిందపడిపోయింది రే. అబ్ తూ మైదోనోఇదరీచ్ హై. కల్లునువ్వూ తియ్యలేదు. నేనూ తియ్యలేదు. చుప్కేలడాయి కర్కే కల్లుకుండా పగల కొట్టుకొన్నాం.

ఖాసిం:—జాణ దేవ్. కత్తాహూనాబత్తా దారూ భిర్ లాయింగే. దేఖ్ రే కోన్కీకాఫర్కీ ఆయూంతో హమా రాజనాబ్ కా పాస్ పకడ్ రే కర్ జాయింగ్ దేఖో.

కరీం:—అచ్ఛా! దేఖుం, మగర్ దోమర్కీకుట్టినా పీపూదుర్గాపట్టిందీ జే. థోడాపీపూగోకూరే. (ఇరువురును గ్రింద కూర్చుందురు. ఖాసిం కరీంపీపును గోకును. వారిరు వురీ విధముగఁ దాగ్రుడు చేష్టలు చేయుచుండఁ గవిచం దుఁడు ప్రవేశించును.)

కవిచం:—ఆహా! ఎట్టకేలకు ఢిల్లీని సమీపించితిని. ఇంతదూరమువచ్చినను నాకాయాసమనిపింపలేదు. కార్య దీక్షాపరులకాయాసమెక్కడిది? అందును నేనిప్పుడు గొప్ప సంతోషవార్త రాజునకెఱింగించుటకుఁ బోవుచున్నాను. అందుచే నెప్పుడాతనికీవిషయమెఱింగింతునా యెప్పుడాతని మన్నన వడయుదునాయనియువ్విళ్ళూరునాకాయాసమెట్లు కలుగును. అదిగాక మాతృభూమినిఁ జేరునపుడెవ్వరికిని సం తోషముకలుగునేకదా! నేను రాజధానిని విడిచి స్వల్ప కాలమేయైనను మరల దానిని సమీపించునపుడెంత కౌతూహలము వొడముచున్నది?

కరీం:—(కవిచందుగ్రనివైపు చూచి మెల్లగా ఖాసిం తో) అరేఖాసిం దేఖోరే ఏక్‌బామ్మన్ ఆయాహకడోరే. పకడ్‌కో సర్కార్ అసఫ్‌ఖాన్‌కాపాస్ జాంగే.

(కవిచందుగ్రఁడాలోచించుకొనుచు మెల్లగా నడచు చుండును. కరీంఖాసింలు వెనుకనుండి మెల్లగావచ్చి కవిచం దుగ్రనిఁ బట్టుకొందురు.)

కవిచం:—(ఆశ్చర్యముతో) ఎవరయ్యా మీరు? నన్నెందుకుఁ బట్టుకొంటిరి. నావద్ద ధనమేమియు లేదు.

ఖాసిం:—అమ్కా ధనంగినంకఖా. తూకాఫర్! చెలో! అమారాసర్కార్ కాపాస్ చెలో. తూచార్ హై. అమారారహస్యాల్కు తుమారా రాజ్కు చెప్పే దానికి తూఆయా. అమ్కామాలుమ్. తు చెలో.

కవిచం:—అయ్యో! నేను చారుఁడను కాను. కవిని. దేశదేశములు తిరుగుచున్నాను. నేను మీజాడలు తెలిసికొనుటకు రాలేదు.

కరీం:—(ముఖమువద్ద ముఖము పెట్టి) క్యా! తూక వీక్యా! హమారాదాడీపర్ ఏక్ పద్దెం బోలో దేఖుం.

కవిచం:—(ముఖము ప్రక్కకుఁ ద్రిప్పికొని తనలో) అబ్బా! వీని నోరు కల్లుకంపు. ఈ మూర్ఖులకుఁ గవిత్వము కావలయునఁట! పృథ్వీరాజును వర్ణించిననోట నీముష్కరుల గడ్డములను వర్ణింపవలసినగతి పట్టినదా? నరే! ఇప్పుడేమి చేయవలయును. వీరిని మంచిచేసికొని మెల్లగఁ దప్పించుకొనిపోవుటయే కర్తవ్యము. మహారాజాలస్యమున కోరువఁజాలఁడు. నేను త్వరగఁ బోయి నా సందేశము నెఱింగింపనిచో నాతఁడు సందేహార్తిచేఁ గుందుచుండును. (ప్రకాశముగా) సాహేబువర్యా! అట్లే చేసెదను. నన్నువదలెదరా?

కరీం:—బోలోజే! నీకీ వదలేదీ తరవాతచూస్తాయ్.
పై లే బోలో.

కవిచం:—క. శహబాసు సీదుదాడీ
సహహా వర్ణింపఁదరమె యజునకునైనన్
నహి దీనికి సరియెందును
మహిఁగొబ్బరిపీచుదాని మహిమకు వెఱచున్.

కరీం:—అచ్ఛా బోలారే బామ్మన్, అబీ ఏక్ పద్దెం బోలో, ఈతకల్లూ అచ్ఛాహై ? తాటికల్లూ అచ్ఛాహై?

కవిచం:—(స్వగతము) ఓరీ ! ముండకొడక ! కవిత్వమున కెంత యుత్కృష్టమగు విషయము దొరకినదిరా నీకు! సరే! ఏమి చేయవలయును. చెప్పక తప్పదు. (ప్రకాశముగా) మరి చెప్పెదను. వినుఁడు.

ఆ. వె. ఈతకల్లుమిగుల నింపైదనర్చును
దాటికల్లుదానితోత రుచిని
నొకటికంటెనొకటి యుత్కృష్ట మిదియట్లు
నిర్ణయింపవచ్చు నిశ్చయముగ.

ఖాసిం:—అచ్ఛా బోలేరే.

కవిచం:—మరి నన్ను విడుపుడు పోయెదను.

కరీం:—నై బొమ్మక్. హమారాసర్కార్ దగ్గ రకూ ఆవ్. నీకీ బౌహుమతి యిప్పిస్తాం.

కవిచం:—నాకు బహుమతులువలదు. నన్ను విడు వుడు పోయెదను.

ఖాసిం:—నీకీ విడిచేదీనహి. నడు. (కవిచందు నిదీసికొని ఖాసిం కరీంలు నిష్క్రమింతురు.)

(తెర)

## ద్వితీయరంగము.



ప్రదేశము:— అసఫ్ఖానుని గుడారము.

(ప్రవేశము:— అసఫ్ఖాను, జోహారున్నిసా, ఆసనములపై.)

జో:— నాథా! చూచితిరా! హిందూరాజుల ధర్మబుద్ధి! చే జిక్కిన శత్రువ నితను ఖైదీగాఁ జేయక మనము విడుతుమా? ఆపృథ్వీరాజు మనుష్యమాత్రుఁడు కాడు. ఎంత పరాక్రమము? ఎంతయౌదార్యము! ఎంత ధర్మనిరతి! అట్టి మహనీయునిఁ జూడఁగలుగుట మన యదృష్టమసుఁడీ!

అస:— చేఁ జిక్కిన శత్రువనితనగు నిన్ను సగౌరవముగ నింకడకనిపి పృథ్వీరాజు మనల యావజ్జీవముఁ దనకుఁ గృతజ్ఞులమగునట్లు చేసెను. నిజముగ హిందూరాజులలో నిట్టి యౌదార్యముండునని నే నెన్నడునుఁ దలఁపలేదు సుమా!

జో:— ఒకరాజులే యననేల? హిందూప్రజల కీ బుద్ధి వెన్నతోఁ బెట్టినదని నాకుఁ దోఁచుచున్నది. నన్నిచ్చటకుఁ బంపునపుడు నాకు సహాయముగా నాతఁడు పంపిన కవిచంద్రుఁడు చూపిన గౌరవము మరపునకు రాదు. నిజ

ముగ వారు మహానుభావులు. మన మర్యాదను నిలువఁ బెట్టిన పృథ్వీరాజు ఋణమెన్నఁడైనఁ దీర్చుకొనఁగలమా?

(ప్రవేశము ఖాసింకరీంలు కవిచంద్రునితో.)

ఖాసింకరీంలు:—(సలాంచేసి) సర్కార్!

అసఫ్:—ఏమిరా! విశేషములేమి? ఇతఁ డెవరు?

కరీం:—ఏ కాఫర్‌కీ ఉదర్ దొరికింది. వీడు చోర్ కన పడ్తాక్ మనకీ ఆచోకీ తెల్సుకొని కాఫర్ రాజుల్కి చెప్పే దాన్కి వచ్చాడు కనపడ్తాక్ సర్కార్.

ఖాసిం:—ఏబొమ్మ్కెకవిధం చెపుతాడు సర్కార్! ఉన్నదీ, లేందీ, కల్పించీచెప్తాడు. వీనికి విడిస్తే చాలా ప్రమాధం సర్కార్!

కవిచం:—ఓరిమూర్ఖులారా! మీ మనముల రంజం పఁజేయు తలంపున మీ కూతల ననుసరించి పద్యములు చెప్పునది ఎంతవిపరీతముగఁ బరిణమించెనురా? (ప్రకాశము గా నసఫ్ఖానుతో) అయ్యా! నేను కవిని. నాకు రాజకీయ ములతో సంబంధములేదు. కవితా సేవ చేయుచు ననేక దేశములు దిరుగుచున్నాను. ఇల్లు విడిచి చాలకాలమైనది. దయచేసి నన్ను విడువుఁడు.

అస:—నీమాట లెట్లు విశ్వసింపవచ్చును. నీవుచూడ హిందువుఁడవు. నీవు చారుఁడవు కావని నమ్ముటెట్లు? కావున నీవు మాఖైదీగ నుండవలయును.

జా:—ఈ బ్రాహ్మణుని కంఠస్వరమును వైఖరియుఁ జూడ నీతని నెచ్చటనో చూచినట్లున్నది. ఈతఁ డెవరై యుండును. (ఆలోచించి) పృథ్వీరాజునకు నేను చిక్కినప్పుడు నాకు సహాయముగా బంపఁబడిన కవిచంద్రుఁడు జ్ఞప్తికివచ్చుచున్నాఁడు. ఇతఁ డతఁడైనచో నీతని విడిపింపవలయు.

కవిచం:—అయ్యా! మీరట్లనిన నేనేమని చెప్పఁ గలను. నన్ను విడిచిపుచ్చి పుణ్యముఁ గట్టుకొనుఁడు. తీర్థాటనముచేయు బ్రాహ్మణునిఁ బట్టుకొనిన మీ కేమి ప్రయోజనము ?

కరీం:— (కవిచంద్రునితో మెల్లగా) అమారా సర్కార్ పర్ ఏక్ పత్ఠం బోలో. సికీవిడ్చి పెడ్తాడు.

అసఫ్:—(కఠినముగ) రాజకీయవిషయములలోఁ గనికరమునకుఁ చోటులేదు. నీవెవడవైనను నిన్ను బంధింపక తప్పదు. ఇఁకమారు వల్కవలదు. (సేవకునితో) ఇతనినొక గుడారమున బందీగనుంచి జాగ్రత్తగఁ గావలియుండుము.

ఖాసిం:—అచ్ఛా! సర్కార్! సలాం.

కవిచం:—(తనలో) అయ్యో! దైవమా! సంయుక్తాప్రేమ సందేశమున కెదురుచూచు మహారాజునకు సంతోషవార్త నెఱిఁగించి యాతని మనోవ్యాకులత దీర్చి, యాతని స్వస్థునిఁజేయకుండ నెట్టి యాటంకముఁ గలిగించితివి? నాకర్తవ్యమును నెరవేర్చి స్వామిభక్తి వెల్లడించుట కవకాశము లేక పోయెఁగా! ఆహా! విధీ! ఈయరణ్యమధ్యమున వీరిచేతులలో దుర్మరణము పొందునట్లు నాతలపై వ్రాసితివా?

ఖాసిం, కరీం:—చెలో. (కవిచంద్రునితో నిష్క్రమింతురు.)

(తెర)

## తృతీయరంగము.



ప్రదేశము:—అరణ్యమున గుడారములో బందికానా.

ప్రవేశము:— ఖైదులో విచారముతోఁ గవిచంద్రుఁడు, ఖైటనాయుధపాణులై ఖాసిం కరీములు.

కవిచం:— ఆహా! ఎట్టివానికెట్టిగతిపట్టెను?

శా॥ ఆహారంబుల రాజభోగ్యమగుమృష్టాన్నాదికంబుల్ సదా
వాహాసంఘమభూషభూషితల సద్భద్రేభరథ్యావళుల్
సాహ్యాచ్ఛందుఁడ రాజరాజసదృశత్వక్ష్మాపాలకాగ్రేసరుం
డాహా! దైవమ! అట్టినాకడవివాఁయర్ జెల్లునే
మృత్యువుర్॥

ఆహా! మహారాజు నారాకకై యెంత తహతహపడుచుండునో కదా! వీరు నన్ను విడుచునట్లులేదు. నా నిజవృత్తాంతము వీరితోఁజెప్పిన మరింత బాధింతురేమో! పృథ్వీరాజు వీరికిఁ జేసినమేలు వీరికి జ్ఞాపకముండునా? ఉండినను వీరికిఁ గృతజ్ఞత ఎక్కడిది? జోహరున్నీసాకూడ నన్నుగుర్తించినట్లగపడదు. ఆమెయే గుర్తించిననన్నుఁ దప్పక విడిపించియుండును. కాని ఆమెకు నానిజవృత్తాంతము తెలియఁజేయుటయెట్లు? ఎటుచూచినను, రాజునకు నాసందేశము చేరుటకవకాశము కనఁబడదు.

సీ. సత్వరంబేనేగి సంయుక్తప్రేమసం
దేశంబునృపతికిఁ దెలుపకున్న
నాతఁడాకులత ప్రచేతస్కుఁడై రాజ
కీయంబులను దిరస్కృత మొనర్చు
రాజకీయంబుల రాజుపేక్షణసేయ
రాజ్యమరాజ కప్రావృతమగు
రాజ్యమరాజకప్రావృతంబైనను
దేశంబు శాత్రవాధీనమగును
గీ. కాన నెట్లైననా కయిగాకయున్న
దేశహితమునకైన మదీయప్రాణ
రక్షణముచేయఁగదవయ్య ప్రాంజలులు ఘ
టించి మ్రొక్కెదనీకున క్రంచరఘ్న.

(ప్రవేశము ఒక సేవకునితో జోహారున్నీసా. సేవకుని బయటనిలిపి జోహారున్నీసా లోనఁబ్రవేశించును.)

కవి:—అమ్మా! మీరెవరో తెలియఁజాలకున్నాను. నన్నుఁ గడ తేర్చుటకు సేనానియనుజ్ఞయయినదా? అట్లయిన సిద్ధముగనున్నాను.

జో:—కవిసార్వభౌమా! యాఘ్రుడవు కాకుము. నీప్రభువునాకు జేసిన మేలునకు నాకృతజ్ఞత చూపుటకిట వచ్చితిని.

కవి:—అమ్మా! మీమాటలు నాకర్థముకాలేదు. మాప్రభువెవరు? అతఁడు మీకుఁజేసిన యుపకార మేమి? మీరెవరో తెలుపఁగూడినఁ దెలుపవేడెద,

జా:—నీ నిజవృత్తాంతము దాపక నాతోఁజెప్పుము. నీవు పృథ్వీరాజు నాస్థానకవియగు కవిచందుఁడవుగావా? నాడునన్ను సగౌరవముగ దెచ్చినది నీవుకావా?

కవి:—(తనలో) ఈమె నన్ను గుర్తించినది. కాని నా నిజవృత్తాంత మెఱింగించుట మరింత హానికరమేమో? ఈమె మాత్రము నన్నురక్షించునను నిశ్చయమెక్కడిది? ఐన నామెమనసు కనిపెట్టి పిదప నిజముచెప్పెదఁగాక, (ప్రకాశముగా) అమ్మా! అట్లేలయనెదరు? నేను బ్రాహ్మణుఁడను. నాకు రాజకీయములతో నేమిసంబంధముండును? నన్ను విడచినచో నింటికిఁబోయెదను.

జా:—కవిచంద్రా! నీవనవసరముగ భయపడుచున్నావు. నీవు నిజముగఁ గవిచంద్రుఁడవేయైనచో నిన్ను విడిపించి, మేము ఋణపడియుండు కృతజ్ఞత దీర్చికొన నిశ్చయించుకొని వచ్చితిని. నాగౌరవమును గాపాడిన నిన్ను, మీరాజును, మరతుననుకొంటివా? మహమ్మదీయులు కృతఘ్నులనుకొంటివా?

కవిచం:—(తనలో) ఈమె వాగ్ధోరణిఁజూడ నీమెనాకనుకూలముగ నేయున్నట్టున్నది. అప్పుడరణ్యమునఁ బురుషవేషమున నున్న సంయుక్తనుగూడ నీమెచూచియేయున్నది. స్త్రీకావున నామెయెడ సానుభూతికలిగియుండును. కనుక జరిగిన వృత్తాంతమంతయు నీమెకెరింగించుటయే కర్తవ్యమని తోచుచున్నది.

జో:— ఏమట్లాలోచించు చుంటివి ? నామాటయందు నీకు విశ్వాసము లేదా ? నీవు చెప్పకున్నను నీవు కవిచందు్రడవని నీపాదమునయున్న కవిగండపెండేరమే చెప్పుచున్నది.

కవిచం:—అమ్మా ! విశ్వాసము లేకేమి ? ఈయరణ్యమున నీకన్న నాకు శరణ్యమెవ్వరు ? మీరు నన్ను బాగుగ గుర్తించితిరి. నాడరణ్యమున మీవారితోఁ బోలిన యువకుఁడు మగవేషమున నున్న సంయుక్తాదేవి. ఆమె జయచంద్ర మహీపాలుని బిడ్డ. ఆమె పృథ్వీరాజును బే్రమించుచున్నట్లనుమానము గల్గుటచే నామె హృదయము కనుగొనుటకై మారువేసమునఁ గనోజికిఁబోయి తిరిగివచ్చుచు మీవారిచేఁ బట్టువడితిని. ఇది నానిజ వృత్తాంతము.

జో:—ఏమి ? ఆయువకుఁడు సంయుక్తయా ! వారిరువురఁగూర్చినచో లోకాతీతమగు దాంపత్య మొనఁగూడు నుగదా ! అక్కడకు మీరుపోయినపని ఏమైనది.

కవిచం:—ఆమె పృథ్వీరాజు మిగులఁ బే్రమించియున్నది. ఈవిషయము మారాజున కెరిగించి యాతని స్వయంవరమునకుఁ బోవఁ బో్రత్సహించు నుద్దేశముతోఁ బోవుచుండ నన్ను మీ సేవకులు పట్టితెచ్చిరి.

జో:—కవీంద్రా ! నిజము చెప్పి నా కానందము గొల్పితివి. మీరు నాకప్పుడు చేసిన యుపకారమునకు బ్రత్యుపకారము చేయుటకు నాకవకాశ మేర్పడినది. సంయుక్త అప్పుడు బురుషవేషమున నున్నను నామె రూపలావణ్యములు నాకు గోచరింపక పోలేదు. ఆమె తప్పక పృథ్వీరాజు

నకుఁ దగినకన్య. కావున నిన్నిప్పుడు విడిచిపుచ్చుటకంటె నేను మీకుఁ జేయఁగల యుపకారమేమియు లేదు. నీవు కవిచంద్రుఁడ వైతివేని నిన్ను విడుచుటకు నాభర్త యనుజ్ఞ నిచ్చియున్నాఁడు. ఇదిగో అతని ఫర్మానా! (ఫర్మానా చూపును.) ఇప్పుడు నీవు బంధవిముక్తుఁడ వయితివి. (కరీంను జూచి) ఓరీ! ఈయన సంకెలల విప్పుము. (ఖాసిం కరీం లొకరినొకరు చూచికొని ఆశ్చర్యము నభినయింతురు.) (కరీం సంకెలల విప్పును.)

జో:—ఇఁక నీవు నిర్భయముగఁ నీయూరు బోవచ్చును. నీకొక గుఱ్ఱమును దోడుగవచ్చుటకుఁ గొందఱు భటులను బయటవేచియున్నారు. అడవిదాటిన పిమ్మట మాభటులను మాకుఁ దిరిగి పంపివేయవచ్చును. పృథ్వీసంయుక్తల వివాహవార్త విని మేము సంతసించెదము గాక! నీవింకఁ బొమ్ము.

కవిచం:—అమ్మా! నీవు మూర్తీభవించిన ధర్మదేవతవు. శెలవు. మీయుపకార మెన్నటికిని మరువజాలను.

జో:—మీకు మాకుఁ జేసిన మేలులో నిదియెంత. పోయిరమ్ము. (నిష్క్రమించును.)

కవిచం:—అమ్మయ్యా! ఇప్పటికి నాకర్తవ్యము నెరవేర్చుట కవకాశము కలిగినది. ఆహా! ఈమె యెంత సుమనస్క!

(నిష్క్రమణము) (తెర)




# పంచమాంకము.

## ప్రథమరంగము.

—ం:ంo—

ప్రదేశము:—పృథ్వీరాజు నంతఃపురమునందొకగది.

ప్రవేశము:—పృథ్వీరాజు, సమరసింహుఁడు.

పృథ్వీ:—కవిచంద్రుని వాక్యములు వింటివికదా! ఇప్పుడు మనము చేయవలసినపని యేమి?

సమ:—సర్వసన్నాహములతోఁ గనోజికి బయలు దేరుటయే.

పృథ్వీ:—కనోజికివచ్చుటకు జయచంద్రుఁడు నన్ను బిలువలేదే!

సమ:—ఇందుఁ బిలుచుటకేమున్నది? ఇదియేమి పంక్తిభోజనమా? భూరిదక్షిణయా? ఒకరాజింకొక రాజును

దనరాజ్యముపై దండువిడియుమని బొట్టుపెట్టి పిలుచునా? అలెగ్జాండరు నీదేశమున కెవరాహ్వానించిరి? హూణుల నెవరుపిల్చిరి? గజినీమహమ్మదాహూతుడై యేనా హిందూ దేశముఁజొచ్చినది?

పృథ్వి:—జయచంద్రునిపై దండు విడియుటకా నీవిప్పుడు నన్నురమ్మనునది!

సమ:—ఔను. అనంతవాహినీపరివృతులమై యాటోపంబునఁ గనోజిపై నెత్తిపోయి జయచంద్రునపరాజితుఁ గావించి, యసితునిఁగ సిమసంగి, తక్కుంగల చిల్లరరాజుల నెల్లఁ జెల్లచెదరుగఁ గొట్టి సంయుక్తాదేవినిఁ గొనివత్తము. పాపమాతఁడు రాజులనందఱఁగట్టి గద్దెయెక్కవలెనని యోచించుచున్నాడు. కాని యీ విద్దెలు మనకడఁ బనికి రావని యెఱుంగఁడు. అచిరకాలములో భరతఖండము నేకచ్ఛత్రముగా నేలఁగలనని కులుకుచున్న యాతని కులుకు నేటితోఁ దీరిపోవును. కృష్ణార్జునులేకమై ఖాండవమేర్చినట్లు మనమిరువుర మాతనిసైన్యాటవి నేర్చెదము.

పృథ్వి:— ఈసంక్షోభము గావించుటకా నన్నుఁ గూడ రమ్మని ప్రేరేపించుచుంటివి! పిమ్మట నేమగునో కొంచెమాలోచింపుము.

సమః—(సాలోచనముగ) రాజసూయానంతరము గదా స్వయంవరము! రాజసూయమున కాటంకము కల్గించిన స్వయంవరము నిలిచిపోవును. (పృథ్వీతో) అందుచేత నేను రాజసూయమున కంతరాయము కల్గింపకుండ జయ చంద్రుని రాజరాజత్వమంగీకరించెదను. మీరుకూడ నా వెంటరండు. స్వయంవరమున సంయుక్తచే వరింపఁబడుదురు గాని!

పృథ్వీ:—జయచంద్రుఁడు నన్నుఁ బిలువ లేదుకదా! స్వయంవరమునకెట్లువచ్చుట! పిలువని పేరంటముకద!

సమర:—నా వేడుక చెలికాని రూపమున సభకరుగుదెండు. ఇతరులెవ్వరును గుర్తుపట్టఁజాలరు.

పృథ్వీ:—ఇతరులు గుర్తింపలేనప్పుడు సంయుక్త మాత్రమెట్లు గుర్తింపఁగలదు.

సమః— సంయుక్త మిమ్ములను గుర్తుపట్టి మీకంఠమున హారము వేయునని కాదు.

పృథ్వీ:—సంయుక్త నన్ను వరింపనిచో నేను స్వయంవరమంటపమున కేగుదెంచి యేమి ప్రయోజనము?

సమః—సంయుక్తాదేవి మిమ్ములగుర్తుపట్టి మీకంఠమున హారము వేయునని చెప్పఁజాలను కాని పృథ్వీరాజ

విహీనంబగు సభకరుగుదెంచి మరెవ్వరికినిమాత్రము హారము వేయదు. కవిచంద్రుఁడిట్లనియేకదా చెప్పినది! అప్పుడు జయచంద్రుడామె నసితుని వరింపుమని నిరోధింపఁగలడు. ఆమె యాతని మాటలుపాటింపకనిలఁబడఁగలదు. జయచంద్రుడప్పుడా యవమానమును సహింపలేక పట్టరాని కోపమ్మున నామెకేదియైన కష్టమును శిక్షారూపకముగాఁ గల్గింపవచ్చును. అట్టిసమయమునమీరున్నచో జయచంద్రునిబారినుండి సంయుక్తాదేవినిఁ గాపాడుటకు వీలుండును. నేనొక్కఁడనేయైన సంయుక్తాసంరక్షణమును సైన్యనిరోధమును రెండును జేయుట కష్టసాధ్యమగును. ఏమందురా? ఆ మందయాననిస్సంకోచముగా నాతో మాటలాడుటకు గొంచెము సిగ్గుపడవచ్చును. మీరామెను దరిఁజేర్చికొనిన మీయుండకొక యీగయైనను రాకుండ నేను చేయఁగలను.

పృథ్వి:—సమరా! జయచంద్రుఁడు నన్ను రాజసూయమునకుఁ బిలువక మిక్కిలిమందబుద్ధియయ్యె సుమా!

సమ:—మందబుద్ధియేమి? తాను రాజసూయము చేయుచున్నట్లు మీకుఁ దెలిసిన మీరాతనిపై దాడివెడలి కన్యాకుబ్జమునుండి మీరాతని వెడలనడతురని భయము. ఒకవేళ నాతఁడు మిమ్ములనాహ్వానించియుండిన మీరాతని రాజసూయమునకుఁబోయి యాతనికిఁ గప్పము కట్టి యాతని సార్వభౌమునిగా నంగీకరించియుందురా?

పృథ్వీ:—నీ విప్పుడాతని సార్వభౌమునిగా నంగీక రించుటకు సిద్ధముగ లేవా?

సమర:—ఇప్పటి పరిస్థితులు వేరు. నేను జయచంద్రుని రాజరాజత్వ మంగీకరింపక యీతనిపై దాడివెడలిన రాజసూయము నిలచిపోవును. అంతట స్వయంవర మాగును. మీవివాహమునకును భంగము కలుగును. నేను జయచంద్రుని రాజరాజత్వమును స్పర్థింపక దానియెడ దాటస్థ్య మును వహించి, యూకడకే పోకుండిన ననాహూతులరగుట మీరునుబోరు. అక్కడ సంయుక్తాదేవిని జయచంద్రుఁడెట్లు నిర్బంధించునో? ఆమె ఎట్టి యిడుములఁ గుడువవలసివచ్చునో? ఎవరికెఱుక? కావున మీ వివాహకార్యైకధురంధరుఁడనై కనోజికి బయలు వెడలితి. మిమ్ముఁగూడ రమ్మని నిర్బంధించుచుంటిని. లేనియెడ నేనాయాతని సార్వభౌమత్వ మంగీకరించుట? ఇప్పటికైనను సరే. జయచంద్రుఁడు సంయుక్త మిమ్ముల వివాహమాడుటకు సమ్మతించి యున్నకుం డిన మన్నింతు. లేకున్న నాతని, నాతనికి సహాయము చేయ వచ్చినవారిని మారిమసంగినట్లు కసిమసంగెద. ఆతనికిఁ గప్పముకట్టి యాతని పాదసేవచేయుటకు నేనంత తేజోదరిద్రుడ నభిమానరహితుఁడఁగాను. ఆతని కానుకలఁ జూచి మోసపోయి నామానము నాతని కమ్మితినని తలంపకుఁడు. ఆతని

సార్వభౌమత్వము స్పర్ధించువారిలో నేను మొట్టమొదటివాడను. రామ యుధిష్ఠిరాదులచేఁ బాలింపఁబడిన భరతవర్షమునకు జయచంద్రునివంటి కుత్సితుఁడా రాజరాజు. రాజరాజునకు శకుని దాపురమైనట్లు జయచంద్రుని కసితుఁడు దాపురమైనాడు. భరతవర్షమునకు సార్వభౌముఁడు గావలయునన్నఁ బృథ్వీరాజు కావలయును. పృథ్వీరాజొక భరతవర్షమునకేకాదు సమస్తపృథ్వీతలంబునకును గూడ సార్వభౌముఁడు కాఁజాలు. ఈవివాహానంతరమే గద్దెపై జయచంద్రుఁడెక్కఁదలఁచెనో యాగద్దెపైఁ బృథ్వీరాజును గూర్చుండఁబెట్టనిచో నేను శస్త్రము దాల్చియేమి ప్రయోజనము ?

పృథ్వీ:—సమరా! నీవట్లంటివి గాని జయచంద్రుఁడు నన్ను రాజసూయమునకుఁ బిలిచియుండినచో నేను తప్పక పోయి యాతని సార్వభౌమత్వ మంగీకరించు చుండెడివాడను.

సమ:—మీరూరక హాస్యమున కట్లనుచున్నారు.

పృథి:—లేదు నేను నిశ్చయముగఁ జెప్పుచున్నాను. నేను జయచంద్రు నాధిపత్య మంగీకరించు చుండెడివాడను.

సమ:—నిజముగ ?

పృథ్వీ:—ముమ్మాటికి.

సమ:—సంయుక్తాదేవియందలి మోహాముచే నట్లను చ టిరి.

పృథ్వీ:—కాదు.

సమ:—అట్లయిన మీరు పృథ్వీరాజుకారు.

పృథ్వీ:—ఏందుచేత?

సమ:—గర్వితానేక వైరివీరకంఠలుంఠనప్రశస్తము లగు హస్తములా జయచంద్రునకు జోడింపఁబడుట

పృథ్వీ:—పృథ్వీరాజు రక్తపిపాసు వనియా నీ యూహా?

సమ:—ఆతఁడు లోకైకవీరుఁడు. అట్టివాఁడు జయచంద్రునకేల జయవెట్టవలె.

పృథ్వీ:—సమరా! ఇటువిను. బలవంతుఁడనని నేనును దురాశాపీడితుఁడై యాతఁడు నొకరితో నొకరు కలహించుచుండిన దేశమున శాంతి లేకపోవుటయే కాక యంతఃకలహము వలన బలహీనయగుటచే దేశము విదేశీయులకు సులభసాధ్యమగును కావున దేశమును అశాంతి, అన్యాక్రాంతమునను నీ రెండు విపత్తులనుండి తప్పించుటకుఁ దప్ప క నేనాతని సార్వభౌమత్వ మంగీకరించు చుండెడి వాడను.

సమ:—అట్లయిన జనులు పృథ్వీరాజు భీరుఁడనియు భయపడి జయచంద్రునకుఁ జేతులు జోడించెననియుఁ జెప్పుకొందురు. పృథ్వీరాజా యపకీర్తికిఁ దాళగలఁడా?

పృథ్వి:— దేశహితము కొరకుఁ దప్పక దనకీర్తి గణించియుండడు. కీర్తికామము మాత్రము స్వార్థపరత్వము కాదా ?

సమ:—(ఉద్దీపితుడై) మహాత్మా! పృథ్వీరాజు ఘనుడని యింతవరకు నేను లోకసామాన్యవిధి నెంచుచుంటినిగాని యాతనిఘనత యొక్క నిజరూపమిప్పుడు గోచరించినది. త్యాగమను నొకశీలము దానియందిట్టి యాత్కృష్టమునుండుట యిదివరకుఁ దెలియనైతిని. నాకాయున్నతాధర్మమును జూపి నీవిప్పుడు గురుఁడవైతివి. ఇంక నేను నీయాజ్ఞానువర్తిని.

పృథ్వి:— సమరా! నీసాధు స్వభావము నకుఁ జాల మెచ్చితి. పార్థునకు శ్రీకృష్ణుఁడెట్టివాడో నీవు నాకట్టి వాడవు.

సమ:— అట్టిగౌరవమును మీరు నాకొసంగితిరి కాన నాచెప్పినట్లు గాపింపుడు.

పృథ్వి:— ఏమది ?

సమ:— సత్వరముగఁ గనోజకిబయలు దేరిపోవుటయే !

పృథ్వి:— సమరా! నాకిప్పుడొకటి తోచుచున్నది. సంయుక్తను నాకిచ్చి పెండ్లి చేయుటకు జయచందునకెంత మాత్రమిష్టముండదు. అట్టియెడ నేనామెను బరిణయమైన

మాయిరువురకునుగల వైరము బలవత్తరమగును. కావున దేశక్షేమమునకై నావైవాహికసౌఖ్యముఁ ద్యజింపనుంటిని.

సమ:—అదియెంత మాత్రమును యుక్తము కాదు. మీరిప్పుడు సంయుక్తాదేవి నుద్వాహమగుచో నీనాతన బాంధవ్యముచే నైనను జయచంద్రుడు పూర్వ వైరమును వీడి మనతో మైత్రి పాటింపవచ్చును. అప్పుడు దేశమున శాంతి నెలకొనఁ గలదు. ప్రణయవిజయము దేశక్షేమము రెండును జేకూరు కావునఁ గనోజయానమే కర్తవ్యము.

పృథ్వీ:—(కొంచమాలోచించి) సరే! అట్లనే కానిమ్ము. మన ప్రయాణమున కంతయు సిద్ధముచేయింపుము.

(నిష్క్రమింతురు.)

(తెర)

## ద్వితీయరంగము.

ప్రదేశము:—జయచంద్రుని దర్బారు.

ప్రవేశము:—జయచంద్రుఁడు, నాతనిమంత్రి జయంతుఁడు, అసితుఁడు, సమరుఁడు, మరికొందఱు రాజులు, మారువేసమున సమరసింహుని ప్రక్కనఁ బృథ్వీరాజు, ద్వారమునొద్దఁ బృథ్వీవిగ్రహము.

జయంత:—రాజేంద్రులారా! రాజసూయయాగము నిర్విఘ్నముగఁ గొనసాగినది. జయచంద్ర నృపశేఖరుఁడు సార్వభౌముఁడైనాడు. ఇఁక సంయుక్తా స్వయంవర మొకటి కొఱతవడి యున్నది. అదికూడ నిప్పుడే జరుగఁగలదు. అదిగో! సంయుక్తా కుమారి మంజరీసహాయయై యిటువచ్చుచున్నది.

సమ:—(పృథ్వితో) మిత్రమా! హెచ్చరిక.

(ప్రవేశము:—మంజరి, సంయుక్త)

సం:—

మ. జననీనీపద పంకజాతముః నస్మన్మానసంబందు బ
త్తినిహత్తింతుగృపావిశేషమునబృథ్వీభూవరుఁగూర్తువౌ
ఘనవిద్వేషదురాగ్రహుఁ,గురుఁ దిరస్కారంబుగావింపఁగా
ననువైధైర్యమునుగ్రహింతొయికనాకాధారమీవేకదా.

ఉ. ఆదట నిన్ను వేడిన మహోదర మొప్పఁగ నేగుదెంచియిం
ద్రాదులమాయజించిదమయంతినినైషధుగూర్చితంటయా
మాదిరి నేడు గూఁడనను మామకనాథుని పజ్జగూర్పఁగా
రాదొకొ నీవెపూన నెదురామనుజన్ములు నల్పబుద్ధులున్.

జయచం:—మంజరీ! ఈరాజచంద్రులను వేరు వేరుగా మీ యువరాజ్ఞికి వర్ణించి చెప్పుము.

మం:—చిత్తము. అమ్మా యిటురమ్మా. ఈతఁడు పాంచాలపతి. కదనసింహుడను సన్వర్థాభిధానముకలవాఁడు.

సం:—(ముందునకుఁ బోవును.)

మం:—యువరాజ్ఞి! ఇతఁడు గోసల నేతరత్నసింగు. ఐశ్వర్యమున నలకాపతిఁ బురుడించు.

సం:—(ముందునకు సాగును.)

మం:—బాలా! ఈతఁడు మాళవేంద్రుఁడగు నుదయార్కుఁడు. తేజమున నుదయార్కునిరీతి భాసిల్లు.

(ప్రక్కకుఁ దిరుగును.)

మం:—ఇతఁడు విదర్భాధీశుఁడు.

సం:—(అనిష్టమును సూచించును.)

మం:—ఇతఁడు పాటలీ పురాధిపతి.

సం:—(మంటపమంతయుఁ గలయఁజూచును)

మం:—ఈతఁడు సమరసింహ మహారాజు సింహ విక్రముఁడు.

సం:—(నమస్కరించి వెడలిపోవును.)

మం:—రాజకుమారీ! ఈతం డసితసింహమహారాజు. మిగుల విస్తీర్ణమయిన రాజ్యమున కధిపతి. భూపాలురలో నెల్ల నీతం డశ్రేష్ఠుండు, (సాభిప్రాయముగా జయచంద్రుని వంకఁజూచును. జయచంద్రుఁడు తలయూచును.)

సం:మంజరీ! ఈవిగ్రహ మెవ్వరిదే. (అని ద్వారము నొద్దనున్న పృథ్వీవిగ్రహమును గూర్చి యడుగును. అందఱు నావైపు జూతురు. జయచంద్రుఁడు నసితుఁ డొండొరులఁ దిలకించుకొని నవ్వుకొందురు.)

మం:—(పరిశీలించి) ఇది ఢిల్లీశ్వరుని బొమ్మగావలయును. (సంయుక్త నివ్వెఱపడి విగ్రహమును దిలకించుచు నిలిచి యుండును)

అసితు:—ఈతఁడు ఢిల్లీపురపాలకుఁడు కాడు. సార్వభౌముని ద్వారపాలకుఁడు.

సమ:—మిత్రమా! ఈవిగ్రహము నిక్కడఁబెట్టిన హస్తముల విధ్వస్తముగావింపవలదా!

పృథ్వి:—తొందరపడకు. సంయుక్త యేమిచేయునో చూతము.

ఉదయార్కుడు:—ఢిల్లీశునట్లువమానించుట బొత్తిగా గానిపని.

కదనసింహుఁడు:—పగయున్నఁ బవరమునఁ దీర్ప వలెనుగాని యిట్టియకృత్యమును గావింతురా ?

రత్నసింగు:—దీనినే యసక్తదుర్జనత్వమందురు.

సం:—(తనలో) మాతండ్రి నాయాత్మేశునాహ్వానింపక పోయినను ఆ మహామహుని విగ్రమునిచ్చటఁ బెట్టించి నాకు గొప్పయుపకారముగావించినాడు. ఈవిగ్రహమిచ్చట లేనిచో బృథ్వీరాజశూన్యంబగు నీమంటపమునకు నేను దెచ్చిన పుష్పహారము నిరర్థకమై యుండునుగదా ! నా కొఱకై దైవము మాతండ్రి నిట్టిపనికిఁ బ్రోత్సహించినాడు. పిదప నేమైనఁగానిమ్ము నాకర్తవ్యము నెరవేర్చెదను. (బొమ్మ మెడలో హారము వేయును.)

జయచం:—ఆఁ ! (ఆసనమునుండి లేచును.)

అసితు:—మంజరి యామె నన్నే ప్రేమించుచున్న దని చెప్పినదే !

సమర:—ఏమి ! ఈమె సాహసము ! ప్రేమఎంతకుఁ జాలదు.

పృథ్వి:—ధన్యోస్మి ! ధన్యోస్మి !

శా. ఏరామామణి నామమంత్ర మెదలో నేవేగ నే నెంతునో
ఆరామామణియే ననుఁ వలచి తాహారంబు గ్రీవంబునన్

సారాంతఃకరణంబుతో నిడుట నాజన్మంబుధన్యంబు,సాం
పారఁ మామక పూర్వజన్మకృతపుణ్యంబుల్ ఫలంబుఁ
గనెఁ.

ఓకాంతామణీ! నేనే ఢిల్లీశుఁడ. నాడునీవు నాకు బహూకృతిగా నిచ్చిన ఖడ్గరాజ మిదిగో! ప్రచ్ఛన్నుఁడనై యుండుట గుఱుతుపట్టలేదేమో యని చెప్పుచుంటి. ఐంద్రం బను సుప్రస్తాజానేయంబుసుసజ్జితమై మనకొఱ కెదురుసూచు చున్నది. పోదముర మ్మ.

సం:—సంయుక్తా! నీజన్మము ధన్యమయ్యెను. (పృథ్వి రాజు కడకు నచ్చును.)

జయచం:—(పట్టరాని కోపమున) నృపవీరులారా! దొంగపోటున నామందిరము సొచ్చి, నాతనయను ముచ్చి లునా నిస్త్రపుని మీకరవాలంబుల కెరచేయుడు. (కత్తిదూసి పృథ్విరాజువంకఁ బరుగిడును. తక్కిన రాజులాతని ననుస రింతురు. పృథ్వీరాజు సంయుక్తను దనవెనుకకుఁ దీసికొని కత్తిదూసి సాముచేయుచు, వారలనిలువరించుచు వెనుకకు జరిగి నిష్క్రమించును. సమరసింహుఁడు మంజరిని తనవెనుక ప్రక్కకుఁ దీసికొని పృథ్వీరాజు స్థానము నాక్రమించి రాజుల నిలువరించును.)

సమ:—పృథ్వీరాజును బట్టుకొనుటంతసులభమైనపని కాదు. సంయుక్తాదేవిస్వయంవరమునఁ దనయిష్టమువచ్చిన వానిని వరించినది. ఇందుమీకెవ్వరికిని గోపకారణమేమియు లేదు. కన్నకూతు నామె యెన్నుకొన్న వానికిచ్చుట తండ్రి విధి. ఇంతకుఁ బృథ్వీరాజేంద్రుఁడు లోకసామాన్యుఁడుకాడే! అట్టివాని నల్లునిగాఁ బడయఁగల్గిన నీవు ధన్యుఁడవు. ఇంత టితో నీవు బృథ్వీరాజునందలి పగ దిగద్రావియాతనితో మైత్రి గావింపుము. ఈనూతన బాంధవ్యముచే మీయిరువుర వైరము లంత మొందుఁగాక ! అట్లుగాక పగసాధింప నెంచెద వేని సమరుని శవముపైనుండిగాని వారలకడకరుఁగజాలవు.

అసితు:—ఈవంచనకంతకు నితఁడే కారణముగాఁ గనిపించుచున్నాఁడు. ముందు వీనిపీచమడపవలయు. (రాజు లందఱు నొక్కపెట్టున సమరునిపైఁ బడుదురు.)

(తెర)

## తృతీయరంగము.

ప్రదేశము:— ఢిల్లీపురము వెలుపల నొకతోట.

ప్రవేశము:— పృథ్వీరాజు, సంయుక్త.

పృథ్వీ:— ప్రియతమే! అదియే ఢిల్లీపట్టణము.

సీ॥ లలితకిరీటమందలి తురాయిమొయున
వాతాహతినినూఁ కేతనమదె
విజయసమేతుఁడౌ వీరునితలవ్రాలె
నత్యుద్ధృతంబు దుర్గాగ్రిమదిగో
పురసతికూర్పాసముకరణి నొప్పారు
కమనీయమైన ప్రాకారమదిగో
నగరంపునీలంపు నవ్యాంబరము వ్రాలు
పరిఖయాయమునా ప్రవంతినియదె.

గీ॥ మించువెన్నెలకుప్పలు మేడలవియె
నగరవాసులకలకల నాదమదియె
గాయకప్రవరుల దివ్యగానమదియె
పరిసరోద్యానకుసుమాళి పరిమళమదె.

**పౌరులకు మనరాక యింకను దెలియదు. అదియునుగాక దూరయానమునఁ జేసి కుసుమసుకుమారమైన నీమేను డస్సియుండనోపు. ఇచ్చట నీపూదోట నీయలమట దీర్చుకొనుము.**

సీ॥ ఒక చెట్టుకొనకు వేరొక చెట్టుకొననుండి
ప్రాకినలతలు తోరణములుగను
పవనాహతిని రాలుపారి జాతాదులు
ముత్తెదువుల సేసముత్తెములుగ
మకరందరసపాన మత్తాళి ఝుంకృతుల్
వందిమాగధులకై వారములుగ
లలితసుమాంచిత లతికాగృహంబులు
రత్నస్థగిత సౌధరాజములుగ

గీ. హృద్యమకరందవాహినుల్ పాద్యముగను
జారుచంపకముకుళముల్ హారతులుగ
మలయపవనుని సీవిరుల్ వెలయ, మధుఁడు
నవవధూప్రదేశంబును నడుపుఁగాక.

చెలికత్తియల పొందు లేకుండుట నీసేవకుఁడ్నేకై దండ నొసంగ ననుగ్రహింపుము. చెలి! యారామ మెంతరమణీయముగా నున్నది.

సీ. పవనవైణిక నఖపరిచలితంబై యొప్పు
తీగల బోలిన తీగ గములు
అదికారణంబుగ నుదయించు తేటుల
శ్రుతినాదమును బోని శ్రుతినినదము

శ్రుతిసమ్మతమ్ముగా శ్రోత్రపేయమ్ముగాఁ
బంచమమ్మునఁ బాడు పరభృతములు
గానానుగుణమృదంగధ్వనిబోలిన
మకరందవాహినీ మర్మరములు

గీ. తదనుగుణముగ నాట్యానఁబొదలు శిఖులు
మెచ్చి తలలూచు వృక్షసమితయు గలిగి
మరునిసంగీతశాలను మరపుదెచ్చు
వనముకలిగించె ముదమును మనమునకును.

ప్రాణప్రియా ! ఆ గులాబిపుష్పమును దిలకింపుము. అది ఎంత మనోహరవర్ణము !

గీ. కులుకువాగేవిచుబుకానఁగుంచెముంచి
వర్ణమిడఁబోలు దానికి వనజభవుఁడు
అతులితానందదాయకమైన యీగు
లాబివర్ణము దొరకునేలాంతిచోట.

ప్రేమమార్గము కష్టభూయిష్టయీగులాబిపుష్పము కంటకావృతమైయున్నది. నవనవప్రోన్మేషంబగు నీశిరీషకుసుమమును గనుఁగొనుము.

గీ. సరవిరక్షకదళ దళాచ్ఛాదనంబుఁ
దొలఁగఁ ద్రోయుచుఁ బుష్పంబుదోచెనిదిగొ
ఎంతమరుగున మగవారలిడినఁ దమ్ము
ముందునకు రాకపోదు రేనుఁగుదలెట్లు.

దేవీ ! నీవేఁజెక్కు లెఱపు లెక్క వివాహవిషయమున నీవు జూపిన సాహసమునుగూర్చి నిందాగర్భముగాఁ బలికితినని తలఁచితివి కాఁబోలు. ప్రజాపకారులు దేశద్రోహులు చెలరేగినపుడు సమదారులనణఁచు సత్యభామయు దేశమున రాజకీయ సంక్షోభ మెక్కువగా నున్నప్పుడు రాజ్యాంగజీవనముగై కొన్న రాజేశ్వరియు, వివాహవిషయమున బంధునిర్బంధ మెక్కువగా నున్నప్పుడు స్వతంత్రించు రుక్మిణియుఁ బ్రభవించుట ప్రసిద్ధము. నీవు నట్టి సతీమణులజాడ మెలంగితివి. యావజ్జీవమును నిలుచునదిగాన వివాహవిషయమున బందునిర్బంధము కంటె వధూవరులయిష్టమునకే యెక్కువ ప్రాముఖ్యము నొసంగవలెనని నాదృఢాభిప్రాయము. ఏజాతియందు నిర్బంధ వివాహములు జరుగునో యట్టిజాతి యభివృద్ధిఁగాంచనేరదు. అట్టిజాతియందు త్తమసంతానముద్భవింపఁజాలదు.

సం:—ప్రాణేశ్వరా !

గీ. ప్రణయవిజయంబు కలిగెనన్ ప్రథితముదము
గురుతిరస్కారమూలక ఘోరచింత
కలపమామకచిత్తంబు కాంతితిమిర
సమపరిచ్ఛన్నమై యొప్పు సంధ్యవోలె.

అదియును గాక తండ్రికిని సమరసింహ మహారాజునకు నతిఘోరముగాఁ బోరు సాగుచున్నది. ఇం దెవరికపా

యను వాటిల్లినను బ్రమాదమే! దానికి నేనే కారణము కాఁగలను. మీరు నన్నెంత ప్రశంసించినను నశాంతికిఁ గారణమైతికదాయని నేను మాత్రము తలపాటుచెందుచుంటి.

పృథ్వి:— కల్యాణీ! నీవింత కుందనక్కర లేదు. జయచంద్రసార్వభౌముఁడు పూర్వము వలెనే యిప్పుడుకూడ బద్ధమత్సరుఁడగునని తలంపకుము. భిన్నావస్థలయందుఁ బదార్థములు భిన్నప్రవర్తనలు గలవగును. అందులకుఁ దార్కాణమేమందువా?

ఆ. వె. వెలది! యొంటినుండ వేధించెఁబువుదోఁట
ఇపుడు నీవునుండ నింపొసర్చు
నగ్నిసన్నదైన నార్పునువాయువు
పెద్దదైనదాని వృద్ధిచేయు.

అదిగో! మంజరియుఁ గవిచంద్రుఁడును వచ్చుచున్నారు.

కవిచ:—నూతనవధూవరల కభ్యుదయపరంపరోస్తు

పృథ్వి:—కవిచంద్రా! యుద్ధవార్త లేమి? మిత్రరత్నమగు సమరునకుఁ గుశలమేకద! మీరప్పుడే యెట్లు రాఁగలిగితిరి?

కవిచం:—రాజేంద్రా! మీరుపోయిన గొంతసేపటికి మంజరిఁగోడ్కొని సమరసింహుఁడు మనసైన్యంబులు

విడిసియున్నస్థలంబున కేతెంచె. వారినిఁ బలువురు రాజకుమారులు సన్నద్ధులై వెంటదరుముచుండిరి. సమరసింహ మహారాజు మనసైన్యములనుగూడుకొని కొంతదవ్వు పారిపోవువాఁడువలె నటించి యాకస్మికముగ నెదురుదిరిగి వైరులను మార్కొనియె. ఆపోటునకుఁ దాళఁజాలక వైరులు వెన్నిచ్చిరి. ఆతఁడు శత్రువిజయమును సూచించఁగతిపయ సైన్యంబులతో మమ్మిటుఁ బంపి తాను శత్రువుల వెంబడించెను. ఆతఁడింతలోనే రానచ్చును.

పృథ్వీ:—కాంతామణీ! నేను జెప్పలేదా? సమరుఁడు విజయలక్ష్మీ సమేతుఁడై యింతలోనే రాఁగలఁడు. నీవు తత్తరపడకుము.

(ప్రవేశము సమరుఁడు)

సమ:—జై! పృథ్వీమహారాజునకుజై!

పృథి:—మిత్రమా వచ్చితివా! భవదీయాద్వితీయ యుద్ధప్రక్రియకవిచందుని వలన విని సంతసించితిని. నీవు శత్రువులబారినుండి నిరపాయముగ రాఁగలిగినందులకు మిగుల సంతోషము.

సమ:—నిరపాయముగ వచ్చుటయేకాదు. జయచంద్రాసితులఁ దమ వైవాహిక పారితోషికములుగాఁ గట్టి తెచ్చితి.

(ప్రవేశము సేవకుఁడు జయచంద్రాసిత సింహులతో)

సం:—(ఆందోళనము.)

జయ:—(ఖిన్నుఁడగును.)

పృథ.—సమరా! ప్రాణాధికుఁడ వగు నిన్నేమియు ననఁజాల. కాని పెద్దలయెడ నెట్లు మెలంగవలయునో నీకుఁ దెలియదు. సార్వభౌముఁడు బంధనముల కర్హుఁడనియే నీకుఁ దోఁచెనా? ఆయన నాకు శ్వశురులనియు, సంయుక్తాదేవికి జనకు లనియు నీకుఁ దెలయదా? (జయచంద్రునివైపుదిరిగి) సార్వభౌమా! సమరసింహుఁడు సలిపిన అవినయమునకు నాతని నన్నునుగూడ క్షమింపుడు.

(కట్లువిప్పి నమస్కరించును.)

సం:—(తనలో) ప్రాణేశ్వరుని లోకోత్తర ప్రవర్తన మపరిమిత సంతోషమును గలుగఁజేయుచున్నది.

జయ:—(తనలో) ఇది యురిసినపుండుపై నుప్పు పెట్టినట్లున్నది.

పృథ:—(అసితుని కట్లు విప్పుచు, సమరునితో) సాటి రాకుమారునకు సల్పవలసిన మర్యాదయే నా యిది?

సమ:—రాజేంద్రులారా! విజయగర్వంబుచే మర్యాద నతిక్రమించి ప్రవర్తించిన నన్ను క్షమియింపుడు.

జయ:—(తనలో) ఇప్పుడే మని ప్రత్యుత్తర మీయ వలయును. అయిన నిట్లనియెద. (ప్రకాశముగా) సమర సింహా! ఇందు నీవుచేసిన దేదియు లేదు. మేము మాపురా కృతకర్మఫల మనుభవించితిమి. నీవు కేవల నిమిత్త మాత్రుఁడవు.

పృ:—నాదింకొక తప్పుకలదు. మీఅనుమతి లేక యే మీయిల్లుసొచ్చి మీతనయను బలిమిఁగొని వచ్చితి. ఇందులకు మా యన్యోన్యానురాగమే నన్నుఁ బ్రోత్సహించినది. అంతియేకాని మీరాజరాజత్వమున కంతరాయము కల్గించు తలంపుకాదు.

కవిచం:—అయ్యా! కాశీపండితవేషమున మీదేశము వచ్చి కవితవెషమున సంయుక్తాదేవి హృదయ మెఱింగి మాభూకాంతున కెఱింగించితి.

సమ:—సార్వభౌమా! సంయుక్తా స్వయంవరమున కనాహూతుఁడగుట రానని యుండిన రాజేంద్రునందులకుఁ బురికొల్పినది నేనే. సంయుక్తా పృథ్వీరాజేంద్రుల పరస్పరాను రాగము నెఱింగినవాఁడగుట నన్యోన్యవైర బద్ధులగు మీయిరువురకు నీనూతన బాంధవ్యముచే మైత్రి సంఘటిల్లఁజేసి తన్మూలమున హిందూస్థానము నంతయు నేకీభ

వింపఁజేసి దేశమును విదేశీయ దుష్ప్రవేశ్యమగు నట్లొనర్చు నుద్దేశమే డీనికిఁ గారణముకావి వేఱొకటికాదు.

సం:—(జయచంద్రుని ముందఱ మోకరించి)

శా. తల్లింగానను జన్మమాదిగ మహాత్మా నీవెయెల్లప్పుడున్
తల్లిందండ్రియు నంచునుందుగద పుత్రప్రేమనీవునన్నుం
బల్లెత్తేమియు మాటనాక పెనుపన్వర్ధిల్లితి న్నేటికిన్
ఢిల్లీశున్వరియించుట న్దరిగెఁగా నీకూర్మి నాపైఁగటా.

తండ్రీ! నాయవినయమునకు నన్ను మన్నింపుము. నా ప్రేమ ప్రవాహమునకు నీవడ్డము వచ్చుటచే నేను నీయాన నతిక్రమింపవలసివచ్చినది. కాని నాయందుఁ బితృభక్తియా వంతయు లోపింపలేదు. కావున నన్ను క్షమియించి యీమ హామహునితో సఖ్యము గావించి నన్నును మాతృభూమినిఁ గూడ నుద్ధరింపుము.

జయ:—(స్వ) ఇప్పుడు నాకు విషమస్థితి తటస్థించి నది. పృథ్వీరాజుతో విగ్రహమే కాని యన్యమొల్ల నని చెప్పు టకు నాతనిచే నిగ్రహింపఁబడి యాతని స్వాధీనమునం దుం టిని. అనుగ్రహమని చెప్పుటకు మనస్కరింపకున్నది. ఎట్లైన నిప్పటి కీతనితో సఖ్యముచేయక తప్పదు. లేకున్న మాన హానితోఁ బాటు ప్రాణహానికూడ వాటిల్లును. గత్యంతరము లేని యప్పుడేమిచేయఁగలను. (సంయుక్తను లేవనెత్తి ప్రకా

శముగా) తల్లీ ! నాయందు మాత్రము నీయందలి వాత్సల్యము లోపించెనా ! నీవు నాకెంతటి యవమానమును గావించి నను నీవొకసారి బ్రతిమాలినంత మాత్రమున నామనము ద్రవించుచున్నది. గడచిన దానికిఁ జింతించి యేమి ప్రయోజనము ? పృథ్వీరాజును నీవింత గాఢముగఁ బ్రేమించుచుంటివని నాకుఁదెలిసియుండిన నింత పుట్టకపోవునుకదా !

మం:—సార్వభౌమా ! మీరరణ్యమున మహమ్మదీయులతో యుద్ధముచేసినప్పుడు మాదేవియు నేనును మారువేసముల నక్కడకు వచ్చి మిమ్ముల విడిపింప సాహసించి తుదకు శత్రువులకుఁ జిక్కసిద్ధముగా నుండ నీధీరవరుఁడు వచ్చి మమ్ముద్ధరించె. నాటినుండియు మా దేవి యతనియందు మనము నిల్పె. మీకాతనియందు శత్రుభావముండుటచే మా దేవి పరిణయమును బైటపెట్టక దాచితిని. దేవి శ్రేయోభిలాషినగుట నన్నిందులకు క్షమింపవేడుచున్నాను.

అసి:—(తనలో)

గీ. వారువారును నిపుడొక్కటైరిగాదె
నేనుమాత్రమె చెడిపోతి(జయచంద్రునిజూపి)వీనినమ్మి
తిలలుతైలంబు నొక్కటె తెరకవాఁడొ
కండుమాత్రమే వేఱగుఁగానిమధ్య.

ఈసమయమున నేనుమాత్ర మన్యథాప్రవర్తించిన హాస్యాస్పదుఁడనగుదు. కాన నిట్లు నటించెద ! (పృథ్వీరాజుతో) రాజేంద్రా ! సంయుక్త నీకుఁ దగినకన్య. నీవామెకుఁ దగినవరుఁడవు. కావున మీవివాహము మాకమందానంద దాయకము. ఇఁక మనపాతపగలు మరచి మనమందరము మిత్రభావమున నుండవలెనని నాకోరిక.

పృ:—అసితసింహా ! అదియేకదా నేను మొదటినుండియుఁ గోరునది.

అసితు:—(జయచంద్రునితో) సార్వభౌమా ! నీ కుమార్తె నీతనికిచ్చి మహావైభవమునఁ బెండ్లిచేయుము. (తనలో) బ్రతుకుజీవుఁడా ! ఈసాములునేర్చిన సాహసురాలిని బెండ్లియాడి నేనేమి సుఖపడవలె.

కవిచం:—రాజేంద్రా ! పౌరులు గుంపులుగూడి మీకు స్వాగతమిచ్చుటకెట్లుకాచుకొనియున్నారో! చూడుము. ఇదియే శుభైకముహూర్తము. కావున గాంధర్వవిధిని సంయుక్తాదేవి కరగ్రహణమొనర్చి మహావైభవమునఁ బురప్రవేశమొనర్తువుగాని త్వరపడుము.

జయచం:—(పృథ్వీరాజుచేతిలో సంయుక్త చెయిపెట్టి) నాచేయు సాలంకృతకన్యాదానమును బరిగ్రహిం

పుము. పంచభూతములు నవగ్రహములు సాక్షిగా నీమెను నీధర్మపత్నిగా స్వీకరింపుము.

కవిచం:—అనయోర్దంపత్యోరభ్యుదయోస్తు!

అందఱు:—తథాస్తు.

(ప్రవేశము అసఫ్‌ఖాను, జోహరున్నీసా, యొక సేవకుఁడు).

అసఫ్‌ఖాను:— పృథ్వీరాజేంద్రా! ఈకానుకలఁ బరిగ్రహింపుము. కనోజియందు జరిగిన వృత్తాంతమంతయు జారులవలనవిని యిటవచ్చితిని. మాకపరిమితానందమైనది. (పళ్లెరమునఁగల కానుకలిచ్చును.)

జో:—(పృథ్వీరాజుతో) మహారాజా! పునర్దర్శనముచే ధన్యులమైతిమి.

పృ:—అమ్మా! మాకవిచంద్రుని విడిపించి మాకృతజ్ఞతకుఁ బాత్రురాలవైతివి. ఈసంఘటన కంతకు నీవే కారకురాలవు.

జో:—మీరునాకుఁ గావించిన యుపకృతికిఁ బ్రత్యుపకృతిఁ గావించి కృతకృత్యనైతి. (సంయుక్తతో) స్త్రీ లోకమున నీవు మిక్కిలి ధన్యవు. అప్పు డరణ్యమున మాసేనలతోఁ బోరినది పురుషవేషమున నున్న నీవని యెరింగినప్పటినుండియుఁ బృథ్వీరాజు నిన్నుద్వాహమగు దినమెప్పుడువచ్చునా యని వేచియుంటి. ఆసుదిన మిప్పుడు వచ్చినది.నీవివాహ

సమయమున నాకానుకగా వీనిఁ బరిగ్రహింపుము. (ఒక ముత్యాలహారము నామె మెడలో వేయును.)

సం:—అమ్మా! నీవు మిక్కిలి సరళహృదయవు. నీతోడిమైత్రివలన నేను మిక్కిలి ధన్యనైతిని. ఈమైత్రియిట్లే శాశ్వతముగా నుండుగాక!

పృ:—ఖానుసాహేబువర్యా! నీసానుభూతికిఁ జాల మెచ్చితి. మనస్నేహము లిట్లే చిరకాలముండుఁగాక! మీ నవాబునకు నాకోరిక చెప్పుము.

అసఫ్:—రాజోత్తమా! తప్పక యట్లే చేసెదను. నాకిఁక సెలవు దయచేయుము.

పృ:—కొన్నిదినము లిచ్చటనుండి మాసత్కారము లఁ గైకొని పిదప నేగవచ్చును. (జయచంద్రాసిత సమరసిం హులఁ దిలకించి) రాజేంద్రులారా! మారాజధానిని మీ రాకచేఁ బవిత్ర మొనరించి నామన్ననల స్వీకరించి నన్ను ధన్యునిఁ జేయఁ బ్రార్థితులు.

అందఱు:—తప్పక యట్లేకానిండు.

కవిచం:—మహారాజా! ఇంకేమికావలయును?

పృథ్వి:—ఇంకేమికావలెను?

శా. నన్నేనమ్మిన కన్నెమిన్నకలిగెన్ నవ్యానురాగంబున
న్నైనాన్నారెన్నివిధావనీపతులతో స్నేహంబువిద్వేషము
ల్సన్నంబైనసియించె సౌఖ్యమున నీక్ష్మాపాలురందెన్ననా
కన్నన్మిన్న యెవండునాకుఁగలదే కామ్యంబువిప్రోత్తమా.

అయిన నిట్లగునుగాక.

తే. గీ. ఐకమత్యంబు దేశాననమరి దేశ
మన్యదేశీయ దుష్ప్రవేశ్యమగుఁగాక !
శాంతినెలకొని మెసఁగవిశ్రాంతి దేశ
భక్తియుదయించుఁగావుత ప్రజలయందు.

కవిచం:—తథాస్తు.

(తెర)




సుజనరంజనీ ముద్రణాలయం, రాజమండ్రి.

